గోపాలకృష్ణమ్మ, కూచిమంచి

ఆంధ్రమీమాంసార్థసారము

అమలాపురము, 1929

Record no. 351

Gōpālakṛṣṇamma, Kūcimañci

Āṃdhramīmāṃsārthasāramu

Amalāpuramu, 1929

Record no. 351

# SUNDARAYYA VIGNANA KENDRAM

1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

గోపాలకృష్ణమ్మ, కూచిమంచి.

ఆంధ్రమీమాంసార్థసారము / గ్రంథకర్త కూచిమంచి గోపాలకృష్ణమ్మ.- అమలాపురము : కూచిమంచి రామమూర్తి, 1929.

9, 9, (1), 75, 5 p. ;20 cm.

Record no. 351

Gōpālakr̥ṣṇamma, Kūcimañci.

Āṃdhramīmāṃsārthasāramu / granthakarta Kūcimañci Gōpālakr̥ṣṇamma.- Amalāpuramu : Kūcimañci Rāmamūrti, 1929.

9, 9, (1), 75, 5 p. ;20 cm.

Record no. 351

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB        Date filming began:

శ్రీః.

# ఆంధ్రమీమాంసార్థసారము


గ్రంథకర్త.

కూచిమంచి గోపాలకృష్ణమ్మగారు, M. A., L. T.,

*Assistant Lecturer in Oriental Languages,*
*Govt. Arts College, Rajahmundry,*
*Formerly Asst. Professor of Sanskrit,*
*Presidency College, Madras.*





ప్రకాశకులు

కూచిమంచి రామమూర్తిగారు

కూచిమంచివారి అగ్రహారము

అమలాపురము.

1929


 [వెల రు. 1–0–0

శ్రీః

గీ॥ హరిని భజియించి మద్గురువరు నుతించి
జైమినిని భట్ట శబరుల సంస్మరించి
బాలురకుఁ బూర్వమీమాంస ఫక్కి తెలియఁ
దెనుఁగుభాషను సులభశైలిని రచింతు॥

---

గీ॥ కూచిమంచి కులాంబుధి కువలయాప్తుఁ
డైన కర్పూరసుందరు నాత్మజుండ
నతుఁడ గోపాలకృష్ణమ్మ నామకుఁడను
గూర్చి వేఁడెద దీని గైకొనుఁడు బుధులు॥

---

శ్రీవాయగురవేనమః.

పిఠాపురము
28-4-1929.

మహారాజశ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారు రచించిన ఆంధ్రమీమాంసాపరిభాషను, ఆంధ్రమీమాంసార్థసారమును, ఆంధ్రమీమాంసా న్యాయదీపికను స్థాలీపులాక న్యాయముగ నచ్చటచ్చట చూచితిని.

ఆంధ్రభాషలో నిట్టి గ్రంథములు మిక్కిలి యపూర్వములు. ఆంధ్రదేశమున మీమాంసా శాస్త్రప్రచారము మిక్కిలి యరుదుగ నున్నది. ఇట్టి సందర్భమున మీమాంసాప్రకరణ గ్రంథములను తెనుగుభాషలో రచించుట మిక్కిలి ప్రశంసనీయము. శాస్త్రసిద్ధాంతములను సర్వజన సుబోధముగ చేయబూనుట వీరికిగల వైదుష్యమును అనుభవమును సహస్రముఖముల చాటుచున్నది. ఇట్టి యపూర్వగ్రంథములను నిర్మించి యాంధ్రదేశమునకును ఆంధ్ర వాఙ్మయమునకును మహోపకారము నొనరించిన శ్రీ గోపాలకృష్ణమ్మగారు సర్వాత్మనా ఆంధ్రలోకముయొక్క కృతజ్ఞతకు పాత్రులు కాగలరని నాదృఢ నిశ్చయము. ఇటులనే వీరు దర్శనాంతరములనుకూడ నాంధ్రీకరించి లోకమునకు మహోపకారము నొనరింతురుగాక.

శ్రీపాద లక్ష్మీనృసింహ శాస్త్రి,
మహారాజాస్థానవిద్వాన్—పిఠాపురం.

---

మ॥ శ్రీ॥ శ్రీయుత కూచిమంచి గోపాలకృష్ణమ్మ (M.A. L.T.) గా రాంధ్రీకరించిన యర్థసంగ్రహమను మీమాంసాగ్రంథమును జదివితిని. అయ్యది సుకుమారమైన చక్కని గ్రాంథిక భాషలో రచియింపఁ

బడియున్నది. సంస్కృతానభిజ్ఞులై యాంధ్రభాషమాత్రమే యభ్యసించియున్నవారికిఁగూడ, మీమాంసాశాస్త్రవిషయములఁ గరతలామలకములుగ నొనరించుటకుఁ దగినంతటి యర్థవ్యక్తి యీగ్రంథమున నగపడుచున్నది. శాస్త్రీయవిషయముల నింత సుబోధముగావించుచున్న వీరి రచనాచాతురి కడుంగడుఁ బ్రశంసనీయమై యితరులకు మార్గదర్శకముగానున్నది. ఇట్టిగ్రంథము లీవఱ కాంధ్రవాఙ్మయమున వెలువడియుండలేదని నా నమ్మకము. ఇట్లే వీ రితరమీమాంసాగ్రంథములనుగూడఁ ద్వరలోఁ బరివర్తించి, యాంధ్రదేశమున మృగ్యమై యున్న మీమాంసాదర్శనము నుద్ధరించి, యీదేశమున కమూల్యమగు నుపకార మొనరింతురుగాక యని మఱిమఱి కోరుచున్నాఁడను.

(True Copy)

చిట్టిగూడూరు. 1-2-28.

(Sd.) దువ్వూరి వేంకటరమణశాస్త్రి,
నారసింహసంస్కృతకళాశాల.

---

V. Ch. Sitaramaswami Sastri, President, Faculty of Oriental Languages, Member, Senate, Academic Council and Board of Studies in Telugu of the Andhra University, Lecturer in Telugu, Maharaja's Sanskrit College.

మ॥ రా॥ శ్రీ॥ కూచిమంచి గోపాలకృష్ణమ్మ యమ్. ఏ. గారిచే రచియింపఁబడిన మీమాంసార్థసారమను ప్రకరణగ్రంథమును నేను జూచితిని. ఈగ్రంథము లౌగాక్షిభాస్కరవిరచితమగు సంస్కృతభాషలోనున్న యర్థసంగ్రహము నాధారముగఁగొని వ్రాయఁబడినది. ఇయ్యది ప్రసన్నము సలక్షణమునగు నాంధ్రభాషలో వ్రాయఁబడినది. ఆంధ్రభాషలో నిట్టి మీమాంసా విషయక గ్రంథము బయలు వెడలి యుండలేదు. ఆంధ్రులు స్వతంత్రముగ మీమాంసాదర్శనజ్ఞానమును



సంపాదించుట కిది మిక్కిలిగ నుపయోగించును. ఆ ధ్రవాఙ్మయమున కిట్టి నవీనాభ్యున్నతి గల్గించు గ్రంథమును రచించుటకు దారిచూపిన గ్రంథకర్తగారి యుద్యమ మెంతయు శ్లాఘ్యము. గ్రంథకర్తగా రిట్టి గ్రంథముల నింకను వెలయించి యాంధ్రభాషాసేవకుల కృతజ్ఞతకుఁ బాత్రులగుదురుగాక. ఇట్టి యుత్తమగ్రంథమునకుఁ దగిన ప్రోత్సాహమొసఁగి విద్యాశాఖవా రాంధ్రవాఙ్మయాభివృద్ధి నొనరించుట యత్యావశ్యకమయి యున్నది.

(True Copy)

Vizianagaram, 3-2-1928.

(Sd.) వఝల చినసీతారామస్వామిశాస్త్రి.

---

J. RAMAYYA PANTULU.

Muktiswaram,
Tottaramudi P. O.,
Godavary Dt.,
*Date/ 3—4—1928.*

I have gone through the first two parts of Andhra Mimamsarthasara by Mr. K. Gopala Krishnamma, M. A., L. T. It is an original work in Telugu containing an exposition of the Fundamental principles of the Purva Mimamsa Darsana which has been rather neglected hitherto in the Telugu Country. It is written in chaste and simple Telugu and it is really creditable to the author that he has been able to hit on just the sort of style which should be used in Telugu books on Scientific subjects. The book under consideration will, in my

opinion enrich the Telugu literature and is fit to be the first of a series of Scientific books in Telugu to be published by the Andhra University.

(True copy)

(Sd.) J. RAMAYYA.

---

మహారాజశ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారిచే ఆంధ్రీకరింపఁబడిన పూర్వమీమాంసాపరిభాషా అర్థసారమీమాంసా న్యాయదీపికలను నేను పరిశీలించి చూచినాను. ఈమూఁడుగ్రంథములు మూలగ్రంథములందుండు విషయములను స్పష్టముగా బోధించుచున్నవి. తెనుగువిద్యార్థులకు సంస్కృతగ్రంథములందుండు మీమాంసావిషయములు ఈగ్రంథములవలన స్పష్టముగాఁ దెలియఁగలవు.

(True Copy)

బుచ్చమ్మఅగ్రహారము,<br>అమలాపురము,<br>30-4-1928.

(Sd.) మరువాడ శంభన్నశాస్త్రి,<br>న్యాయవేదాంతాధ్యాపకుడు.

---

మహారాజశ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారిచే రచియింపఁబడిన (1) ఆంధ్రమీమాంసాపరిభాష (2) ఆంధ్రమీమాంసార్థసారము (3) ఆంధ్రమీమాంసాన్యాయదీపిక, యనెడి మూఁడుగ్రంథములను నేను పరిశీలించిచూచినాను. ఈగ్రంథములు సంస్కృతభా





షాజ్ఞానములేని యాంధ్రులకు, పూర్వమీమాంసాశాస్త్రమునందలి విషయములను బోధచేయుట కత్యంతోపయోగముగానున్నవి. వీరు ఇంతశ్రమను వహించి లోకోపకారము చేసినందుకుగాను నేను అత్యానందమును బొందుచున్నాను. మిక్కిలి గహనమైన శాస్త్రసిద్ధాంతసారమును సంగ్రహించి అతిసులభమైనశైలిని ఆంధ్రభాషలో వ్రాసినారు. కనుక ధనసమర్థులైన విద్యాపోషకులు ఈగ్రంథము శక్యమయినంత త్వరలో ప్రచురింపఁజేసి లోకమునకు ఉపకరింతురని నేను దృఢముగా నమ్ముచున్నాను.

(True Copy)

ముక్కామల,<br>అమలాపురంతాలూకా,<br>తూ॥ గోదావరిజిల్లా,

(Sd.) భమిడిపాటి సోమనాథశాస్త్రి,<br>19-1-1929.

---

మహారాజశ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారు రచించిన యాంధ్రపూర్వమీమాంసా గ్రంథములు స్థాలీపులాకన్యాయమున వింటిని.

ఆంధ్రభాషలోఁ బూర్వమీమాంస నవతరింపఁజేయుటకుఁ దీర్థకరులు వీరే. పుణ్యపాపనిరూపణాధారమగు నపూర్వఫలవాద మతిగ్రంథము లాంధ్రమున నపూర్వములగుట లోపమే. ఆలోపము దీర్చి మనయాంధ్రులకు నత్యంతసులభమును సలక్షణమునగు నాంధ్రభాషలో దుర్బోధమగు విషయమును సుబోధముగావించిన వీరియెడ నాంధ్రులు కృతజ్ఞులయి వీరిగ్రంథములు వ్యాప్తిలోనికివచ్చు సాధనములు తమతమశక్తి ననుసరించి చేయుటవిధి. ఆంధ్రాభిమానమప్పుడే యన్వర్థ

మగును. ఈగ్రంథములవలనఁ బ్రత్యాంధ్రుఁడును వేదమతసిద్ధాంతములు గ్రహింపఁగలఁడు. అప్పు డాంధ్రుల కాంధ్రవేదము గావలయునను నాసక్తి కవకాశము గలుగును. ఆంధ్రవేదమవతరించు నదృష్ట, మాంధ్రులకుఁ గలుగనిదియే ఓంకారము. అని నాతలంపు.

(True Copy)

పిఠాపురము.
18-2-1929.

ఇట్లు విధేయుఁడు,
(Sd.) శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి.

---

పూర్వమీమాంసార్థ జిజ్ఞాసువులగు నాంధ్రుల కుపయోగకరముగా నుండునట్లు మహారాజశ్రీ కూచిమంచి గోపాలకృష్ణమ్మ యమ్. ఏ. గారు మిక్కిలి శ్రద్ధతో సులభశైలిని రచియించిన యీగ్రంథము, తెలుఁగులో నాశాస్త్రము లేని కొఱఁతను దీర్చుచున్నది. శాస్త్రసంప్రదాయసిద్ధమును సులభవివరణోపేతమును నగు నీ గ్రంథకర్త మీమాంసాంధ్రీకరణోద్యమము వైదికమార్గ ప్రవర్తకులైన యాంధ్రుల సమాదరణమున సార్థకమగునని భావించుచున్నాను.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.





ఓమ్.

బ్ర॥ మ॥ రా॥ కూచిమంచి గోపాలకృష్ణమ్మగారు తాము వచనరూపమున రచియించి ముద్రింపించిన యీ ధర్మమీమాంసాపరిభాష, ఆంధ్రమీమాంసార్థసారము, అను గ్రంథములను వారివలన వందనపూర్వకముగ నందుకొని చదివి యానందించితిని. శ్రీ గోపాలకృష్ణమ్మగారు సంస్కృతభాషయందుఁ గావించిన పరిశ్రమ మీవిధముగ స్వదేశజనులకు నుపకరింపఁ జేసినందులకు వారినిమిగుల శ్లాఘించుచున్నాను.

మీమాంసాశాస్త్రమును గుఱించి తెలిసికొనఁదగిన గ్రంథమేదియు నింతవఱ కాంధ్రభాషలో వ్రాయఁబడినది కానరాదు. అట్టిలోప మీగ్రంథములు తొలఁగించునని తెలుపుటకు సంతసించుచున్నాను. తమయనుభవమునుబట్టి శ్రీ గోపాలకృష్ణమ్మగారీగ్రంథముల నెంతో సులభశైలిని వ్రాసినారు. అయినను శాస్త్రానుభవముగల వారియొద్ద శ్రద్ధతో నభ్యసించిననే కాని యందలి విశేషములు తచ్ఛాస్త్రపరిచయము లేనివారికి సుబోధములు కావని నాయాశయము. ఇక్కాలమున నాంధ్రభాషకుఁ గళాశాలలయందు నధిక ప్రాముఖ్యము విద్యాశాఖాధికారులు కలిగించియున్నారు. కావున నేతద్గ్రంథమునకు సవిశేషాదరము పాఠశాలలయందుఁ బూర్ణముగఁ గలుగఁగలదనియు, నట్లు కలుగుట యత్యావశ్యకమనియుఁ దలంచుచు శ్రీ గోపాలకృష్ణమ్మగారి పరిశ్రమమునకుఁ బరమేశ్వరుఁ డర్హమైన ఫలిత మచిరకాలమునఁ గలిగించుఁ గాక యని కోరుచున్నాను.

రాజమహేంద్రవరము.
23-9-29.

(Sd.) వడ్డాది సుబ్బారాయఁడు.

---

# ఉపోద్ఘాతము

మీమాంసయను శబ్దము, వేదములయందు, 'కర్మములనుగూర్చిన సిద్ధాంతములకు సంబంధించు సంశయము, విచారణ' అను నర్థమునఁ బ్రయోగింపఁబడినట్లు తెలియుచున్నది. కావున, వేదప్రామాణ్యము, ఆచారము, కర్మములు మున్నగువిషయములనుగూర్చి మతభేదములుండుటచే వేఱువేఱు వేదశాఖలేర్పడి, వేదవిహితములగు కర్మముల నాచరించుట విషయమై యేదేనొక నియతమైన వ్యవస్థలేనికాలమునందీ మీమాంసయనెడి శాస్త్రముత్పన్నమైనది. అది యెట్లంటేని= కర్మములనాచరించురీతి వేదమునందలి బ్రాహ్మణములయందు వివరముగా బోధింపఁబడకుండుటంజేసి, వేదవిహితమైన కర్మములను సరిగా నాచరింపఁగోరువానికిఁ దాను జేయు కర్మములు వేదవిహితములై సరిగానున్నవో లేవో యని సంశయములు కలుగుచుండెడివి. అట్టి సంశయములు తఱచుగాఁ గలుగుచుండుటవలన వానిని దీర్చి స్పష్టపఱచుప్రమాణము లేమియులేనిదే యాకర్మములు వేదముచే విహితమగురీతిని నాచరింపఁబడినవని నిశ్చయించుటకు వీలులేకయుండెను.

చిరకాలమునుండి శిష్టసంప్రదాయసిద్ధముగా వచ్చుచుండిన యాచారమే యీ విషయమయి ముఖ్యప్రమాణముగా నుపచరించుచుండెడిది. ఇట్లు వేదము శిష్టాచారము నను రెండు ప్రమాణములనే యనుసరించి యజ్ఞాదికర్మము లాచరింపఁబడుచుండెను. పిమ్మట వేదమునందలి విధులను శిష్టాచారమును బాగుగ విమర్శించి యా రెండింటిని సరియైన ప్రమాణములనుగా స్థాపించుచు యాగములు ఇష్టులు మున్నగు కర్మముల నాచరించు విధానము సంక్షేపముగా ఋషులచే

వివరింపఁబడినది. ఇట్లు వివరించినవాక్యములే కల్పసూత్రములనఁబడు చున్నవి. కాని కొన్ని కర్మములు వేదమునందలి మంత్రభాగమునం దొకరీతిగను, బ్రాహ్మణమునందు మఱియొకరీతిగను విధింపఁబడుట మున్నగు పరస్పరవిరోధములు వేదమునందలి యనేకస్థలములయందు వినఁబడుచుండుటం జేసి యాయాస్థలములందలి కర్మముల నాచరించు విధానమును నిష్కృష్టముగా నిర్ణయించుటకు సూత్రకారులధికముగాఁ గ్లేశపడుచుండిరి. ఆపరస్పరవిరోధములను సమర్థించుటమూలముగా నిట్టి క్లేశములను నివర్తింపఁజేసి యాగముల నాచరించు విధానమును గ్రమమును నిర్ణయించు న్యాయములను వేదసమ్మతముగా రచియించుట యావశ్యకమైనది. ఉదా।

1. ఏదేనొక కర్మము నాచరించుక్రమమునుగూర్చి మంత్రమునకును బ్రాహ్మణమునకును విరోధముసంభవించు నెడ బ్రాహ్మణముకంటె మంత్రమే యుచ్చరింపఁబడుటమూలమునఁ గర్మమునకంతరంగమగుటంబట్టి బ్రాహ్మణముకంటె నెక్కువప్రమాణముగా నంగీకరింపవలసియున్నది.

2. "అగ్నిహోత్రం జుహోతి" యను వాక్యముచే విధింపఁబడు 'అగ్నిహోత్రహోమము' ముందును, 'యవాగూం పచతి' అను వాక్యముచే విధింపఁబడు గంజిని వండుట తరువాతను వేదమునందు వినఁబడుచున్నను, ప్రయోజనమునుసరించి, వండినగంజితోనే యగ్నిహోత్రమను హోమము నాచరింపఁదగును. గనుక వేదమునందు వినఁబడు క్రమమును విడిచి గంజిని వండుట ముందును, అగ్నిహోత్రమను హోమము నాచరించుట తరువాతను జరుపఁబడవలసియున్నవి.

ఇట్లు కర్మములకు సంబంధించు విధానము మున్నగు విషయములను వివరముగా నిర్ణయించు న్యాయముల సముదాయమునకే



పూర్వమీమాంసాశాస్త్రమని పేరు. ఈశాస్త్రము జైమినిమహాముని చే సూత్రరూపముగా వివరింపఁబడినది. ఈశాస్త్రమునను సరించియే యాగము మున్నైన కర్మముల నాచరించువిధానము సూత్రముల మూలమున 'ఆపస్తంబుడు, బోధాయనుఁడు, ఆశ్వలాయనుఁడు' మొదలయిన ఋషులచే నాయాశాఖాసంప్రదాయానుగుణముగా బోధింపఁబడినది. ఈసూత్రములకే కల్పసూత్రములనియు, శ్రౌతసూత్రములనియును బేర్లు గలవు. ఇట్టిపూర్వమీమాంసాశాస్త్రము కర్మానుష్ఠానమునకు నావశ్యకములగు న్యాయములను నియమములను బోధించుచుండుటంబట్టి వేదమునందలి కర్మములను బ్రతిపాదించుటచే కర్మకాండమనఁదగు భాగమునకు సంబంధించియున్నది జ్ఞానకాండమనఁదగు నుపనిషత్తులు దక్క మిగిలిన వేదభాగమంతయుఁ గర్మాచరణమునే ప్రధానముగా బోధించుచున్నది. కనుక వేదమునందలి మంత్రములనెడి వేఱొకపేరుగల సంహితలు, బ్రాహ్మణములలో నెక్కువభాగమును గర్మములనే ప్రధానముగా బోధించుచుండుటవలన నీపూర్వమీమాంసయను శాస్త్రమునకు విషయములగుచున్నవి.

ఈపూర్వమీమాంసయను శాస్త్రము పైనివివరింపఁబడినరీతిని గర్మములనాచరించు విధానము నేర్పఱచు సందర్భమున నావశ్యకముగా నుత్పన్నమైన న్యాయముల సముదాయమే స్వరూపముగాఁ గలదైనను, నీన్యాయములు లోకవ్యవహారమునందలి యనేకసందర్భములయందుఁ గలుగుసంశయములనుదీర్చి నిష్కృష్టమైన పద్ధతులను సయుక్తికముగాఁ దెలియఁజేయుటమూలమునఁ బ్రజలకనేకభంగుల నుపకరింపఁగలవు

ఈపూర్వమీమాంసాశాస్త్రము ధర్మముయొక్క స్వరూపము దానినాచరించువిధము, దానివలనగలుగు ఫలము, దానిని స్పష్టముగానిరూపించు ప్రమాణము మున్నైన విషయములను బోధించుచున్నది.

ఏకర్మము, దానినాచరించువాని యిష్టము నుత్పాదింపఁగలుగుటం జేసి, యట్టిఫలమును గోరువానిచేఁ జేయఁబడవలసినదిగా వేదమునందు బోధింపఁబడుచున్నదో యట్టికర్మము ధర్మమనఁబడుచున్నది. ఉదా॥ యాగములు ఇష్టులు మొదలగునవి- ఏకర్మము దానినాచరించువాని కనిష్టము నుత్పాదించునదగుటం జేసి యెవ్వరిచేతను జేయఁబడరానిదిగా వేదమునందు బోధింపఁబడుచున్నదో యట్టికర్మము అధర్మమనఁబడుచున్నది. ఉదా॥ ఎఱ్ఱయుల్లిని భక్షించుట, అసత్యము పలుకుట మొదలైనవి. ఇట్టిధర్మము నాచరించువిధానము మున్నగు విషయములను సరిగాబోధించుటకొఱకు వేదము, స్మృతి, శిష్టాచారము నను మూఁడు ప్రమాణములుగలవు. అందు వేదము నిత్యమై భ్రమము, ప్రమాదము, వంచింపనిచ్ఛ మొదలగు దోషములులేని శబ్దమగుటచే స్వతంత్రమైన ప్రమాణమగుచున్నది. అట్టివేదము ననుసరించినదగుటచే స్మృతియు, వేదస్మృతులను రెండింటిని ననుసరించినదగుటచే శిష్టాచారమును, ధర్మాధర్మములను నిర్ణయించుటకుఁ బ్రమాణములగుచున్నవి.

వేదమునందు విధులు, మంత్రములు, నామధేయములు, నిషేధములు, అర్థవాదములు అను నాలుభాగములు కలవు. ఏదేనొకఫలమును గోరువాని నాఫలమును సంపాదింపఁగలుగు కర్మమునందుఁ బ్రవర్తింపఁజేయు వాక్యము విధివాక్యమనంబడుచున్నది. ఉదా॥ 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' (=స్వర్గమునుగోరువాఁడు జ్యోతిష్టోమమను యాగమునాచరించుటచేఁ దనయిష్టమునుత్పాదించుకొనవలయును.) లోకమునందొకవృద్ధుఁడొకబాలుని 'గోవును దీసికొనివచ్చుట' అనునిట్టి పనులయందుఁ బ్రవర్తింపఁజేయుటకై ప్రయోగించు 'గోవును దీసికొనిరమ్ము' అనునిట్టి వాక్యములమూలముగా బాలునిచేఁ దెలియందగు ప్రేరణ (=విధించుట) యనునది యీవాక్య



మును బ్రయోగించిన వృద్ధుని యభిప్రాయవిశేషమైయుండును. వేదమునందుండు "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అనునిట్టి విధివాక్యములందన్ననో, 'వేదములు నిత్యములు అపౌరుషేయములు' నని పూర్వమీమాంసకుల సిద్ధాంతమగుటం జేసి, యీవిధివాక్యములను బ్రయోగించు పురుషుఁడెవఁడును లేఁడుగనుక విధించుట (=ప్రేరేపించుట,=ప్రేరణ=చోదన) యను నర్థమీ విధివాక్యములయందుండు క్రియాపదములందలి "లిఙ్, లోట్, తవ్య" అను నీమూఁడింటిలో నేదేనొక ప్రత్యయముచేతనే తెలియంజేయఁబడుచున్నదని గ్రహింపవలయును.

ఇట్టివిధివాక్యములలో నేదేనొక కర్మముయొక్క స్వరూపమునుమాత్రము జేయందగినదానినిగా విధించు వాక్యమునకుత్పత్తివిధియని పేరు. ఉదా॥ "అగ్నిహోత్రం జుహోతి" (=అగ్నిహోత్రమను పేరుగల హోమమునాచరించుటచేఁ దనయిష్టమునుత్పాదించుకొనవలయును). ఇట్లు ప్రత్యేకమైన గోవులు ధనము మున్నగు ఫలములలో దేనిని దెలియంజేయని "విశ్వజితా యజేత" (=విశ్వజిత్తనుయాగము నాచరించుటచే నిష్టమునుత్పాదించుకొనవలయును) అను నీమున్నగు విధివాక్యములయందు దందఱచేతను సామాన్యముగాఁ గోరఁబడఁదగిన స్వర్గము ఫలముగా గ్రహింపవలసియున్నది.

ఏకర్మమునకైన 'దీనినెట్లాచరింపవలయును' అని విధానమునుగూర్చిన యాకాంక్ష కలుగును గనుక నట్టి కర్మమున కంగములగు ద్రవ్యము దేవత మున్నగు వానిలో దేనినైన నిర్దేశించుట మూలముగా నాకర్మము నాచరించు నితికర్తవ్యత (=విధానము=చేయువిధము)ను బోధించు విధివాక్యములు వినియోగవిధులనఁబడుచున్నవి. ఉదా॥ "దధ్నా జుహోతి" (=పెరుగుతో హోమమునాచరించుటమూలముగా నిష్టమునుత్పాదించుకొనవలయును) ఈవినియోగవిధి 'అగ్ని

హోత్రంజుహోతి' అను నుత్పత్తివిధితో నేకాన్వయమునుబొంది యగ్నిహోత్రహోమము నాచరింపఁజేయుటకై యుపకరించుచున్నది.

వినియోగవిధులయందు వినఁబడు ద్రవ్యము దేవత మున్నగు వానిని విధులకు సంబంధించు నుత్పత్తివిధులయందలి ప్రధానకర్మముల కంగముగా నిర్ణయించుటకొఱకు (i) శ్రుతి, (ii) లింగము, (iii) వాక్యము, (iv) ప్రకరణము, (v) స్థానము, (vi) సమాఖ్య యనునాఱు ప్రమాణములు గలవు. అవి యెట్లంటేని:— “దధ్నా జుహోతి” అను వినియోగవిధియందలి 'దధ్నా' అను పదమునందుండు తృతీయా విభక్తియనెడు శ్రుతిప్రమాణముచే దధి 'జుహోతి' యను పదముచే బోధింపఁబడు హోమమునకంగమని తెలియుచున్నది. ఇట్లే మిగిలిన ప్రమాణములమూలముగా జరుగు వినియోగము తెలియందగియున్నది.

కర్మములనాచరించుటకును, వానినుండి జనియించు ఫలము ననుభవించుటకును బురుషున కావశ్యకమగు యోగ్యత 'అధికారము' అనఁబడుచున్నది. అట్టి యధికారమును విధించువిధికి 'అధికారవిధి' అని పేరు. ఉదా॥ “రాజా రాజసూయేన స్వారాజ్యకామో యజేత” (=క్షత్రియుఁడై స్వర్గరాజ్యమును గోరువాఁడు రాజసూయ యాగము నాచరించుటచేఁ దనయిష్టమును సంపాదించుకొనవలయును.) ఇచట క్షత్రియుఁడై యుండుట స్వర్గరాజ్యమునుగోరుట యను నీరెండును జేరి యధికారమగుటచే నీవిధి 'అధికారవిధి' యగుచున్నది.

విధివాక్యములలోఁ గొన్ని ఉత్పత్తివిధులును అధికారవిధులును గూడ నగుచున్నవి ఉదా॥ “ఉద్భిదా యజేత పశుకామః” (=పశువులనుగోరువాఁడు ఉద్భిత్తను పేరుగల యాగమునాచరించి యజించుటమూలముగాఁ దనయిష్టము నుత్పాదించుకొనవలయును.) ఈ



విధి ఉద్భిత్తను యాగము నిచటనే విధించుటచే నుత్పత్తివిధియు, 'పశువులను గోరువాఁడు' అను నధికారమును బోధించుటచే నధికారవిధియును గూడ నగుచున్నది.

ప్రధానయాగములకు సంబంధించు నవాంతరక్రియల నాచరించుక్రమమును శ్రుతి మున్నగు నాఱుప్రమాణములమూలమున నిరూపించుచు యాగముయొక్క ప్రయోగమును సమగ్రముగా వివరించు విధి ప్రయోగవిధియనఁబడుచున్నది. ఉదా॥ “దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత” “సమిధో యజతి” ఈమున్నగు విధుల సముదాయము.

మంత్రములనఁగాఁ గర్మముల ప్రయోగము (=ఆచరణము= అనుష్ఠానము) నందావశ్యకముగాఁ దెలియందగు ద్రవ్యము దేవత మున్నగు విషయములను స్మరింపఁజేయుట యనెడి ప్రత్యక్షమగు ప్రయోజనమును సిద్ధింపఁజేయుట మూలముగాఁగాని, కర్మమువలన నపేక్షింపఁబడు ఫలము నుత్పాదింపఁదగు 'అపూర్వ' మను నొకశక్తి విశేషమును జనింపఁజేయుట మూలముగాఁగాని కర్మానుష్ఠానమున కుపకరించు వాక్యములు. ఉదా॥ (i) అగ్నయే జుష్టం నిర్వపామి (=అగ్నికొఱకిష్టమగు హవిస్సును వండఁబడిన హవిస్సునుండి వేఱుపఱచుచున్నాను.) కర్మమునందావశ్యకములగు అగ్నియను దేవత, పురోడాశమను హవిస్సనను నీరెండును నీమంత్రముచే స్మరింపఁజేయఁబడుచున్నవి. (ii) “హుం ఫట్” ఈమున్నగు మంత్రములు వానినుచ్చరించుపురుషునియందొక యపూర్వమునుత్పాదించి దానిమూలమున నపేక్షితమగు ఫలమును జనింపఁజేయఁగలవు.

విధివాక్యములయందచ్చటచ్చట విధింపఁబడు కర్మముల పేర్లు వినఁబడుచున్నవి. ఆపేర్లే నామధేయములనఁబడుచున్నవి. ఉదా॥

"ఉద్భిదా యజేత పశుకామః" అను విధియందలి 'ఉద్భిత్', అను శబ్దము "అగ్నిహోత్రం జుహోతి" యను విధియందలి "అగ్నిహోత్ర" అను శబ్దము మున్నగు పదములు తత్ప్రఖ్యము, తద్వ్యపదేశము మొదలయిన నాలుగైదు ప్రమాణములమూలముగాఁ గర్మనామధేయములని నిర్ణయింపఁబడినవి. ఈనామధేయములాయా కర్మములను నిర్దేశించుచుఁ దన్మూలముగాఁ బ్రమాణములగుచున్నవి.

అనిష్టమునుత్పాదింపఁగలుగు కర్మములనుండి పురుషుని నివర్తింపఁజేయు వాక్యములు నిషేధములనంబడుచున్నవి. ఉదా॥ "న కలఞ్జం భక్షయేత్" (=ఎఱ్ఱయుల్లిని భక్షించుట యనర్థము నుత్పాదించును గనుక నాపని నెవఁడును జేయరాదు.

అర్థవాదములనఁగా విధివాక్యములందు విధింపఁబడువాని ప్రాశస్త్యమును దెలియంజేయుట మూలముగాఁగాని, నిషేధవాక్యములచే నిషేధింపఁబడువానియందుండు దోషమును దెలియంజేయుటమూలముగాఁగాని విధినిషేధములతో నేకాన్వయమును బొందుటచేఁబ్రమాణములగు వాక్యములు. ఉదా॥ (i) "వాయుర్వై క్షేపిష్ఠా దేవతా" ఈమున్నగు వాక్యము (=వాయువు శీఘ్రగమనముగలవాఁడు గనుక నతనికొఱకు శ్వేతపశువును సమర్పించి యాజించుటచేఁగలుగు ఫలము శీఘ్రముగా లభించును.) (ii) "బర్హిషి యో రజతం దదాతి పురా అన్యసంవత్సరాత్ గృహే రుదన్తి" (=ఎవఁడు రజతమును బర్హిస్సునందుంచి దక్షిణగానిచ్చునో వానియింటిలో నొకసంవత్సరమునకు ముందుగా రోదనము సంభవించును.

ఇట్లు విధులు మంత్రములు మున్నగు నైదువిధములుగానుండు వేదము ధర్మాధర్మములను నిరూపించుటకుఁ బ్రమాణమగుచున్నది. ఇట్లే మను పరాశరాదులు రచియించిన స్మృతులును, వేదోక్తసం



ప్రదాయసిద్ధమగు శిష్టాచారమునుగూడ ధర్మాధర్మములవిషయమై ప్రమాణములగుచున్నవి. పైనిసూచింపఁబడిన విషయములన్నియు నీయాంధ్రమీమాంసార్థసారమను గ్రంథమునందు సవిస్తరముగా వివరింపఁబడినవి. ఈపూర్వమీమాంసాశాస్త్రమునకు సంబంధించు ననేకవిషయములింతకుముందు నాచే రచింపఁబడి ముద్రింపింపఁబడిన "ఆంధ్రమీమాంసాపరిభాష" యందలి యుపోద్ఘాతమ్మున బాగుగ వివరింపఁబడినవి గనుక నిచట మరల నావిషయములనుగూర్చి వ్రాయలేదు.

ఈగ్రంథము శాస్త్రగ్రంథమగుటచే దీని ముద్రణాసమయమునందు ప్రూఫులు సరిచూచినప్పటికిని గడపట ముద్రించినపుడు పెక్కుస్థలములయందు అక్షరప్రమాదములు సంభవించినవి. కనుక దీనిని జదువువారు జాగ్రత్తతోఁ జదువుచు సంశయముగలిగినపుడెల్లఁ దుదిని ముద్రింపఁబడియున్న తప్పొప్పుల పట్టికనుజూచి యాప్రమాదములను సవరించుకొందురుగాక.

కూచిమంచి గోపాలకృష్ణమ్మ.



# విషయసూచిక.



శ్రీరస్తు.

శ్రీహయగ్రీవాయ నమః

# ఆంధ్ర మీమాంసార్థసారము

## ధర్మలక్షణము.



పరమదయాళువును బూజ్యుఁడునునగు జైమినిముని ధర్మము యొక్క స్వరూపమును నిరూపించుటకై, పండ్రెండధ్యాయములుగల పూర్వమీమాంసాశాస్త్రమును రచియించెను. అతఁడాశాస్త్రమందు మొదట [1]"అథాతో ధర్మజిజ్ఞాసా" అను సూత్రముమూలముగా, ధర్మమునుగూర్చిన [2]విచారము [3]కర్తవ్యమని తెలియఁజేసెను. ఈసూత్రమునందు మొదటిదగు 'అథ' శబ్దము [4]'వేదాధ్యయనమైనపిదప' అను నర్థమును బోధించుచున్నది. రెండవదగు 'అతః' అను శబ్దము 'వేదాధ్యయనమునకు దృష్టమగు ప్రయోజనముకలదు' అని స్పష్టముగాఁ దెలియఁజేయుచున్నది. "స్వాధ్యాయోఽధ్యేతవ్యః" (=వేదము యథావిధిగాఁ జదువుటచే నిష్టమునుత్పాదించునది.) అను విధియొక్కయర్థమును విమర్శించు సందర్భమునందు, వేదాధ్యయనమునకు, దానియందలి [5]నిరూఢమైన యర్థమును దెలిసికొనుటయనెడి [6]దృష్టప్రయోజన

1 అథ + అతః + ధర్మజిజ్ఞాసా:- 2 విచారము = విమర్శము 3 కర్తవ్యము = చేయఁదగినది 4 వేదాధ్యయనము = వేదముల యథావిధిగాఁ జదువుట.

5 నిరూఢమైన = ముఖ్యమైన 6 దృష్టప్రయోజనము = ప్రత్యక్షముగుప్రయో

ము కలదని నిర్ణయింపఁబడినది గదా! కాఁగా, "అథ అతః ధర్మజిజ్ఞాసా" అను పై సూత్రమునకు, 'వేదమును యథావిధిగాఁ జదివిన వెంటనే, వేదమును జదువుటకు, దానియందలి యర్థమును దెలిసికొనుట యను దృష్టప్రయోజనము కలదుగనుక, వేదమున కర్థమగు ధర్మమును గూర్చి [7] జిజ్ఞాస చేయవలసినది' అని యర్థమేర్పడుచున్నది. ఇచట జిజ్ఞాసయనుపదము [8] 'లక్షణా' యనెడి సామర్థ్యముచే 'విచారము' అనెడు నర్థమును దెలియఁజేయుచున్నది. కావున నీశాస్త్రమందలి "అథాతో ధర్మజిజ్ఞాసా" అను మొదటిసూత్రమునకు 'ధర్మమును గూర్చిన [9] విచారరూపమగు నీశాస్త్ర మారంభింపఁబడఁదగినది' అనునది యర్థమని స్పష్టమగుచున్నది.

ఇఁక ధర్మమన నేమి? దానికి [10] లక్షణమేమి? అను ప్రశ్నముల

జనము. 7 జిజ్ఞాస = విచారము = విమర్శము 8 "ఈపదమువలన నీయర్థమును గ్రహింపవలయును" అని పూర్వమునందీశ్వరునిచేఁ జేయఁబడిన యేర్పాటునకు సంకేతమని పేరు. అట్టిసంకేతమునను సరించి ఆయాశబ్దములవలన గ్రహింపఁబడు నర్థము సంకేతితార్థమనియు, ముఖ్యార్థమనియు, శక్యార్థమనియు వ్యవహరింపఁబడుచున్నది. ఆసంకేతితార్థమును గ్రహింపఁజేయు సామర్థ్యము శక్తియనియు, నాయర్థము శక్యార్థమనియు వ్యవహరింపఁబడుచున్నది. ఎచటఁ బదమువలన శక్యార్థమును గ్రహించినచో వాక్యాన్వయము (లేక తాత్పర్యము) కుదురదో యచట శక్యార్థమును విడిచి యాపదమువలననే శక్యార్థముతో సంబంధించు మఱియొక యర్థమును గ్రహింపవలసియున్నది. ఇట్టి మఱియొక యర్థము లక్ష్యార్థమనియు దీనిని గ్రహింపఁజేయు పదసామర్థ్యము లక్షణయనియు నలంకారశాస్త్రమున వ్యవహారముగలదు. ఉ. 'గంగయందు గొల్లపల్లె కలదు.' ఈవాక్యమందు 'గంగ' పదమునకు శక్యార్థమైన జలప్రవాహమునను సరించినచో వాక్యార్థము కుదురదు గాన శక్యార్థమైన జలప్రవాహముతో సంబంధముగల తీరమను లక్ష్యార్థము నాగంగపదమువలననే గ్రహింపవలసియున్నది. ఇట్లయినచో గంగాతీరమందు గొల్లపల్లెకలదని సరియైనయర్థమేర్పడుచున్నది.

9 శాస్త్రములందు 'విచార' మను పదమునకు విమర్శనమని యర్థము.

10 'నహి లక్షణప్రమాణాభ్యాం వినా వస్తుసిద్ధిః' (2 ఏవస్తువునకైనను లక్ష



కీక్రిందిది సమాధానము. యాగములు మున్నగునవియే ధర్మము. 'వేదముచేఁ బ్రతిపాదింపఁబడునదియుఁ, బ్రయోజనముగలదియు నగు నర్థము' అనునది ధర్మమునకు లక్షణము. ఇచట 'ప్రయోజనముగలది' అను విశేషణముండుటవలన నీలక్షణమునకు, వేదముచేఁ బ్రతిపాదింపఁబడు స్వర్గము మున్నగు ప్రయోజనములందు 'అతివ్యాప్తి' దోషము సంభవింపదు. భోజనాదులయందతివ్యాప్తి సంభవింపకుండుటకై యిచట 'వేదముచేఁ బ్రతిపాదింపఁబడునది' అను విశేషణ ముంపఁబడినది.

శత్రువధయను [11] ననర్థముఫలముగాఁగలదగుటచే ననర్థమగు శ్యేనయాగము మున్నగువానియందీలక్షణమున కతివ్యాప్తిసంభవింపకుండుటకై, యీలక్షణమందు [12] 'అర్థము' అను పదముంపఁబడినది

ధర్మమునకు వేదముప్రమాణము.

చోదనయను శబ్దము వేదములోనొక భాగమగు విధిని మాత్రము బోధించుచుండుటంజేసి [13] యీధర్మలక్షణము, "చోదనాలక్ష

ణమును బ్రమాణమును లేనిదే దాని స్వరూపము సిద్ధింపనేరదు) అను న్యాయమునను సరించి యిచట ధర్మమునకు లక్షణమును బ్రమాణమును నిరూపింపవలసియున్నది. లక్షణమనఁగా, నొకజాతివస్తువులయందెల్ల నుండునదియు, నితరజాతులయందెచటను నుండనిదియుఁ, గనుకనే 'అవ్యాప్తి' 'అసంభవము' 'అతివ్యాప్తి' అను నీమూఁడు దోషములలో నేదియు లేనట్టిదియు నగు గుణవిశేషము. ఉ. గోవునకు 'గంగడోలు తోఁక మున్నగునవి కలిగియుండుట' లక్షణము. ఇచట గోవు లక్ష్యమగుచున్నది. అతివ్యాప్తిఅనగా లక్షణము లక్ష్యమందేగాక యితరమందెచటనైన వర్తించుట. గోవునకు "కొమ్ములుగలది" అనునది లక్షణముగాఁ జెప్పినయెడల గోవుకంటె నితరములగు మహిషాదులయందుఁగూడ నాలక్షణము వర్తించును గాన నిచట నీలక్షణమున కతివ్యాప్తియను దోషముసంభవించును.

11 అనర్థము = ఇష్టము కానివగు నరకము మున్నగు వానిని గలిగించునది.

12 అర్థము = ఇష్టములగు స్వర్గము మొదలగువానిని సంపాదించునది.

ణోఽర్థోధర్మః" ([14] చోదనయే [15] లక్షణముగాఁగలయర్థముధర్మము) అను సూత్రమందలి ధర్మలక్షణముతో విరోధించెడిని" అనిశంకింపరాదు. ఆసూత్రమందలి చోదనాశబ్దమునకు సకలవేదమును నర్థమగుచున్నదిగదా! సర్వవేదమును ధర్మమునందే [3] తాత్పర్యమును బొందు నర్థముగలదగుటచే వేదమంతయు ధర్మమును బోధించునదియే యగుచున్నది.

అట్టి ధర్మమగుయాగాదికము, "యజేత స్వర్గకామః" (=స్వర్గమును గోరువాఁడు యాగమాచరించుటచే నిష్టము నుత్పాదింపవలయును.) అను విధివాక్యమువలన, స్వర్గముఁగోరు పురుషునిచేఁ గర్తవ్యముగా, విధింపఁబడుచున్నది. అది యెట్లంటేని.- ఈవిధియందలి 'యజేత' అను పదమందు 'యజ్' అనుధాతువును, 'త' అనెడి ప్రత్యయమునసెడు రెండంశములు గలవు.

'త' ప్రత్యయమునందుఁగూడ *a*'ఆఖ్యాతత్వము.' *b*'లిఙ్త్వము' నను రెండంశములుగలవు వానిలో నాఖ్యాతత్వమనునది [16] పదిలకారములయందును [17] సాధారణముగానుండునది లిఙ్త్వమనునది మట్టుకు విధినిబోధించు 'లిఙ్' అను లకారవిశేషమందు మాత్రమే యుండును.

భావనావివరణము.

ఈ రెండంశములచేతను భావనయనునదియే తెలియఁజేయఁబడుచున్నది. భావనయనఁగా, 'పుట్టెడిదానిని బుట్టునట్లుచేయు' (పుట్టించువాని) [18] వ్యాపారవిశేషము. అది శబ్దభావనయనియు 'అర్థభావన' యనియు రెండువిధములుగా నున్నది.

13 పైనిచెప్పఁబడిన 'వేదముచేఁ బ్రతిపాదింపఁబడునదియుఁ బ్రయోజనముగలదియు నగు నర్థము' అనునది.

14 ఏదేనొకకర్మమునందొకనిని బ్రవర్తింపఁజేయు వాక్యము = విధివాక్యము.



శబ్దభావన.

వానిలో శబ్దభావనయనఁగా *a* పురుషప్రవృత్తికనుకూలించునదియు, నాప్రవృత్తిని బుట్టించువాఁడు చేయునదియు, నగు నొకవిధమైన వ్యాపారము అది 'త' ప్రత్యయమునందుండు లిఙ్త్వమను నంశముచే బోధింపఁబడుచున్నది లిఙ్ ప్రత్యయముగల క్రియాపదమేదేని ప్రయోగింపఁబడినపుడెల్ల, నట్టిప్రయోగ మెవనికొఱకు నుద్దేశింపఁబడినదో వాఁడు, 'ఈక్రియను బ్రయోగించినవాఁడు నన్నేదేనొకపనియందుఁ బ్రవర్తింపఁజేయుచున్నాఁడు,' లేదా, 'ఈ నాప్రవృత్తికనుకూలించు వ్యాపారము నితఁడు జేయుచున్నాఁడు,' అని తెలిసికొనును. ఏది యేశబ్దముచేఁ దప్పక తెలియఁజేయబడుచున్నదో యది యాశబ్దమునకు (*a*) శక్యార్థమగుచున్నది. ఉదాహరణము:- 'గోవును దీసికొనిరమ్ము' అను వాక్యమందలి 'గో' శబ్దముచే నెప్పుడును [19] గోజాతి తెలియఁజేయఁబడుచుండుటచే నది 'గో' శబ్దమునకర్థమగుచున్నది.

15. చోదనవలనఁ దెలియఁబడు (*a*) తాత్పర్యము = పర్యవసానము = ఫలితార్థము. *a*. ఆఖ్యాతత్వము = క్రియాసామాన్యమును బోధించుట. *b* (*a*) లిఙ్త్వము = [illegible]ధించుటయను క్రియావిశేషమును బోధించుట.

16. సంస్కృతమునందు వర్తమానము, భూతము మున్నగుపది కాలములను దెలియఁజేయు ప్రత్యయములు.

17. సాధారణముగా = సమానముగా = అవిశేషముగా *a* దీనికి తెలుఁగున 'లూట్' అను పేరుగలదు.

18. వ్యాపారవిశేషము = ఒకానొకవ్యాపారము,

*a*. పురుషప్రవృత్తియనఁగా నొకపురుషుఁడు తానపేక్షించినఫలమును గలిగించు నేదేనొకపనిని జేయుటకు యత్నించుట.

*b* శక్యార్థము ఇంతకుముందు వివరింపఁబడియున్నది.

19. గోవులయందెల్ల నుండునదియు, నితరములయందెచటను నుండనిదియునగు నాకృతివిశేషము.

## లౌకికశబ్దభావన—వైదికశబ్దభావన.

అట్టి వ్యాపారవిశేషము, 'గోవును దీసికొనిరమ్ము,' 'పాఠము చదువునది,' ఈమున్నగునేదేనొకపురుషునిచే బ్రయోగింపబడు [20] లౌకిక వాక్యములయందు, వానిని బ్రయోగించు పురుషుని యభిప్రాయ విశేషమగుచున్నది. 'వేదమును యథావిధిగాఁ జదువునది' ఈమున్నగు [21] వైదికవాక్యమునందన్ననో, యట్టివాక్యమును బ్రయోగించు పురుషుఁడు [22] లేనందున, భావనయగు వ్యాపారవిశేషము, దానియందలి సంస్కృతభాషయందుండు 'లిఙ్, లోట్, తవ్య' అను [A] శబ్దములయందుండునదియే. ఇట్టి శబ్దములయందుండునది గనుకనే యీభావన 'శబ్దభావన' యనఁబడుచున్నది.

అట్టి (శబ్ద) భావనయందు 'సాధ్యము', 'సాధనము', 'ఇతికర్తవ్యత', అను మూఁడంశములావశ్యకములగుచున్నవి. 'దేనినిఁ జేయవలయును?' అను ప్రశ్నమునకుత్తరమే [23] సాధ్యము; 'దేనిచేతఁ జేయవలయును?' అను ప్రశ్నమున కుత్తరమే [24] సాధనము; 'ఎట్లుఁ

20. లౌకికవాక్యము = లోకమందొక పురుషుఁడు మఱియొకని నేదేనొకపనియందు నియమించుటకు వానినుద్దేశించి ప్రయోగించువాక్యము
21. వైదికవాక్యము = వేదమునందలి (పురుషుని నేదేనొకకర్మమునందుఁ బ్రవర్తింపఁజేయు విధి) వాక్యము ఉదా. "సత్యం వద" (అర్థము) "ధర్మం చర" ఈమున్నగునవి.
22. వేదము నిత్యమనియు, నేపురుషునిచేతను నిర్మింపఁబడియుండలేదనియుఁ గావుననే యపౌరుషేయమనియు మీమాంసకుల సిద్ధాంతము.
ఇ లోకమున గ్రహింపఁబడు నర్థమునిచ్చు ధ్వనివిశేషము.
23. ఒకపనిచే సాధింపఁబడు ఫలము = భావ్యము.
24. సాధనము = ఒక ప్రయోజనమును సాధించుటకు నవశ్యముగానుపయోగించునది.



జేయవలయును?' అను ప్రశ్నమున కుత్తరమే [25] 'ఇతికర్తవ్యత'. ఈ శబ్దభావనయందు 'సాధ్యమేది?' అని [26] యాకాంక్షముకలుగఁగా, ముందువివరింపఁబోవు మూఁడంశములతోఁగూడిన యర్థభావన, [27] సమానాభిధానమైన శబ్దమగు 'త' ప్రత్యయముచేతనే తెలియఁజేయఁబడినదగుటవలన, సాధ్యముగా నన్వయించుచున్నది 'సంఖ్య' 'కాలము' మున్నగునవికూడ 'త' అను నొకేప్రత్యయముచేఁ దెలియఁజేయఁబడుచున్నవైనను (ఇ) నయోగ్యములగుటవలన నీభావనయందు సాధ్యముగా నన్వయింపనేరవు. సాధనమేదియని యాకాంక్షకలుగఁగా, 'లిఙ్ లోట్ తవ్య' అను ప్రత్యయముల యర్థమును దెలిసికొనుట, కరణముగా నన్వయించుచున్నది. ఇంతకుముందే యీభావన లిఙాదిశబ్దములయందున్నది గాన వీనియర్థమును దెలిసికొనుట యనునది భావనను త్పాదించుటమూలముగా 'కరణ' మగుటలేదు. కాని యదివఱకేయుండు భావనను స్ఫురింపఁజేయుటమూలముగాఁ గాని, శబ్దభావనయందు [28] భావ్యమగు నర్థభావనను [29] నిర్వర్తింపఁజేయుటమూలముగాఁగాని, యది ([30] లిఙాదిజ్ఞానము) శబ్దభావనయందుఁ గరణముగా నన్వయించుచున్నది. ఇతికర్తవ్యత యేదియని యాకాంక్షకలుగఁగాఁ నర్థవాదములవలనఁ దెలియఁజేయఁబడు (వి

25. ఇతికర్తవ్యత = ఒకపనిని జేయువిధము—ఇత్థంభావము, కథంభావము.
26. ఆకాంక్ష = తెలిసికొననిచ్ఛ.
27. ('శబ్దభావన, అర్థభావన' అను నీరెండింటిని) సమానముగా బోధించు శబ్దము. 27 ఇ అయోగ్యములు = అన్వయింపఁదగనివి. 28. భావ్యము = సాధ్యము.
29. నిర్వర్తింపఁజేయుట = సిద్ధింపఁజేయుట. కుఠారముచే నొకకఱ్ఱను ఛేదించి రెండుగాఁ జీల్చునపుడు, కుఠారము, ఛేదనక్రియచేఁగలుగు 'రెండుగాఁజీలుట' ను జనింపఁజేయుటమూలముగా ఛేదనక్రియయందెట్లు కరణమగుచున్నదో యట్లే.
31. 'లిఙ్, లోట్, తవ్య' అను ప్రత్యయముల యర్థమును దెలిసికొనుట.

ధేయములయందలి) (ఇ) ప్రాశస్త్యము (దెలిసికొనుట) ఇతికర్తవ్యతగా నన్వయించుచున్నది.

### అర్థభావనాలక్షణము.

అర్థభావనయనఁగా, నొకానొక ప్రయోజనమును గోరుపురుషుఁడు దానిని [31] సాధించుపనినాచరించుటకుఁ జేయు దృఢ [32] ప్రయత్నము. [33] ఆఖ్యాత సామాన్యము క్రియారూపమగు వ్యాపారమును దెలియఁజేయును గాన నీయర్థభావన 'త' ప్రత్యయముచే, దానియందుఁడు నాఖ్యాతత్వమను నంశముమూలమున బోధింపఁబడుచున్నది. అట్టి యర్థభావనయందును, 'సాధ్యము, సాధనము, ఇతికర్తవ్యత,' అను మూఁడంశము లావశ్యకములగుచున్నవి. 'దేనినిఁ జేయవలయును' అను ప్రశ్నమునకుత్తరమే సాధ్యము. 'దేనిచేతఁ జేయవలయును' అను ప్రశ్నమునకుత్తరమే సాధనము. 'ఎట్లు చేయవలయును' అను ప్రశ్నమునకుత్తరమే 'ఇతికర్తవ్యత' ఈయర్థభావనయందు సాధ్యమేదియని యాకాంక్షకలుగఁగా, స్వర్గము మున్నగు [34] ఫలము సాధ్యముగా నన్వయించుచున్నది. సాధనమేది? యనియాకాంక్షకలుగఁగా, యాగము మున్నగునవి కరణముగా నన్వయించుచున్నవి. ఇతికర్తవ్యత యేదియని యాకాంక్ష కలుగఁగా, ప్రయాజములు మొదలగు నంగముల సమూహ మితికర్తవ్యతగా నన్వయించుచున్నది

30 ఇ ప్రాశస్త్యము = ప్రశస్తముగానుండుట, గుణముకలదగుట.

31. సాధించు = సిద్ధింపఁజేయు 32. ప్రయత్నము = వ్యాపారము.

33 ఆఖ్యాత సామాన్యము = ప్రతియాఖ్యాతము. జనసామాన్యమనఁగా ప్రతి జనుఁడు అని యర్థమగునట్లు. ఆఖ్యాతము = ధాతువునకుఁ జేర్పఁబడునట్టియు, క్రియను స్ఫురింపఁజేయునట్టియు ప్రత్యయము. ఇచట 'యజేత' అను క్రియారూపమందు 'త' ప్రత్యయమాఖ్యాతము.

34. పురుషుఁడు తానుజేయుపనికిఁ బ్రయోజనముగా నపేక్షించునట్టిది.



### వేదలక్షణ విచారము.

ఇఁక వేదమననేమి? అను ప్రశ్నమున కీక్రిందిది సమాధానము. వేదమనఁగా నేపురుషుని చేతను రచియింపఁబడని (కనుక నేనిత్యమగు) శబ్దసముదాయము అది 'విధి, మంత్రము, నామధేయము, నిషేధము, అర్థవాదము' అను నైదువిధములుగా నున్నది.

### విధి [35] మీమాంస.

వానిలో విధియనునది, యేయితరప్రమాణముచేతను దెలియఁబడనియర్థమును (స్వర్గము మొదలగు ప్రయోజనములను సాధించు యాగము మున్నగు దానిని) దెలియఁజేయు వేదభాగము. అట్టివిధి, [36] ప్రమాణాంతరముచేఁ దెలియఁబడనిదియు, స్వర్గాది ప్రయోజనములను సాధించునదియునగు యాగము మున్నగు నర్థములను విధించుటచే [37] సార్థకమగుచున్నది. ఉదా:- "అగ్నిహోత్రం జుహుయాత్ స్వర్గకామః" (=స్వర్గమును గోరువాఁ డగ్నిహోత్రమను హోమము నాచరించుటచే నిష్టము నుత్పాదింపవలయును.) అనువిధి, ప్రమాణాంతరముచేఁ దెలియఁబడనట్టియు, స్వర్గమను ప్రయోజనమును సాధించునట్టియు, 'అగ్నిహోత్ర' హోమమును విధించుచున్నది. ఈవిధివాక్యము వలన 'అగ్నిహోత్ర' మను హోమముచే స్వర్గము నుత్పాదింపవలెను, అనునర్థ మేర్పడుచున్నది. ఏవిధియందలి కర్మము ప్రమాణాంతరముచేఁ దెలియఁబడియుండునో యావిధియందట్టి కర్మము నుద్దేశించి యేదేనొక గుణము మాత్రము విధింపఁబడును. (ఇట్లు గుణమునుమాత్రము విధించువిధి గుణవిధియనఁబడుచున్నది.)-ఉదా:- "దధ్నా జుహోతి" (=పెరుఁగుతో హోమము నాచరించుటచే నిష్టము నుత్పాదించునది). ఇచట హోమము "అగ్నిహోత్ర

35. మీమాంస = విచారము. 36. ప్రమాణాంతరము = మఱొకప్రమాణము. గ్రామాంతరమనఁగా మఱియొక గ్రామమనునట్లు. 37. సార్థకము = సఫలము.

జుహుయాత్" అను [38] విధ్యంతరముచేఁ దెలియఁబడినదగుటంజేసి దానిని (హోమమును) 'జుహోతి' అను క్రియాపదముచే నుద్దేశించి పెరుఁగుమాత్రము గుణముగా విధింపఁబడుచున్నది. ఈవిధివాక్యమువలన 'పెరుఁగుతో హోమమునాచరించుటచే నిష్టము నుత్పాదింపవలయును' అనునర్థమేర్పడుచున్నదిగదా! ఎచ్చట 'కర్మము, గుణము' నను రెండును ప్రమాణాంతరముచేఁ దెలియఁబడవో యచట [39] గుణవిశిష్టమగు కర్మము విధింపఁబడును. ఉదా:—"సోమేన యజేత" (=సోమవిశిష్టమగు యాగముచే నిష్టము నుత్పాదింపవలసినది.) ఇచట సోమరసమను గుణము యాగమునను నీరెండును ప్రమాణాంతరముచేఁ [40] బ్రాప్తింపనివగుటచే [41] సోమవిశిష్టమగు యాగము విధింపఁబడుచున్నది. 'సోమ' పదమునకు మత్వర్థ (అదికలది యను నర్థ) మందు లక్షణనంగీకరించుటచే నీవిధినుండి 'సోమముగలయాగముచే నిష్టము నుత్పాదించుకొనవలెను' అను నర్థము సిద్ధించుచున్నదిగదా! ఈవిధి సోమము యాగము నను రెండింటిని విధించుటచే, [42] వాక్యభేదము సంభవించెడి నని శంకింపరాదు. ఈ రెండును బ్రత్యేకించి వేఱువేఱుగా విధింపఁబడుటలేదుగదా! ఇచట సోమవిశిష్టమగు యాగ మొక్కటియే స్పష్టముగా విధింపఁబడుచున్నది "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' (=స్వర్గమునుగోరువాఁడు జ్యోతిష్టోమమను యాగమునాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనవలయును.) అను విధివాక్యముచేఁ బ్రాప్తించిన యాగమును 'సోమేన యజేత' అను వాక్య

38. విధ్యంతరము = మఱియొకవిధి. 39. గుణవిశిష్టము = గుణముతోఁ గూడినది. = గుణముగలది. 40. ప్రాప్తింపనిది = తెలియఁబడనిది. 41. సోమవిశిష్టము - సోమముతోఁగూడినది.

42 వాక్యభేదము = ఒకేయన్వయముగల వాక్యమును రెండు వేఱువాక్యములుగా నన్వయించుట.



మందలి 'యజేత' పదముచే నుద్దేశించి, సోమమను గుణముమాత్రమే విధింపఁబడవచ్చునే! 'సోమముచే యాగము నాచరించునది' అని యర్థమేర్పడునే! ఇట్లుండ 'సోమ' పదమునకు మత్వర్థమందు లక్షణయేల యంగీకరింపవలయును" అని శంకింపరాదు. 'జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత' అనునది [43] యధికారవిధిగావున [44] 'ఉత్పత్తి' విధి కానేరదుగదా. "అయ్యా! 'ఉద్భిదా యజేత పశుకామః' (=పశువులనుగోరువాఁడుద్భిత్తను యాగమునాచరించుటచే నిష్టము నుత్పాదించుకొనునది) అను విధివలెనే జ్యోతిష్టోమవిధి యుత్పత్తివిధియు నధికారవిధియుఁగూడఁ గావచ్చునే" అనియును శంకింపఁబనిలేదు. దృష్టాంతమగు నుద్భిద్యాగమునకు మఱియొక యుత్పత్తివాక్యమేమియు లేనందునను, 'ఉత్పత్తి' వాక్యము లేనిచో నీయుద్భిద్యాగమునకు [45] విధానమే కుదురనందునను, నీయుద్భిద్వాక్యము 'ఉత్పత్తివిధి' అనికూడ నంగీకరింపఁబడినది. ఇంతేకాక, జ్యోతిష్టోమవాక్యము [46] నుభయవిధిగానే యంగీకరించినచో దీనిచేతనే యాగము, యాగమునకు ఫలమునకుఁగల సంబంధము, నను నీరెండును బోధింపఁబడుచున్నవిగాన, నీజ్యోతిష్టోమవాక్యమునందు వాక్యభేదమనుదోషము తప్పక సంభవించెడిని. కావున ('సోమేన యజేత' అను విధిని గుణవిధిగా నంగీకరించినచో నిన్నిదోషములు సంభవించును గనుక) నిచట 'సోమ' పదమునకు మత్వర్థమందు లక్షణనంగీకరించి సోమవిశిష్టమగు యాగము విధింపఁబడుచున్నదని యంగీకరించుటయే శ్రేయము.

విధి, ఉత్పత్తివిధి, వినియోగవిధి, అధికారవిధి, ప్రయోగవిధి, అని నాలుగువిధములుగలది.

43 యాగమునకు ఫలముతోఁగల సంబంధమును తెలియఁజేయు విధి.

44. ప్రమాణాంతరముచేఁ బ్రాప్తింపని కర్మమునుమాత్రము విధించువిధి.

45. విధించుట. 46. ఉభయవిధి = ఉత్పత్తివిధియు నధికారవిధియుఁగూడ నగు విధి.

## ఉత్పత్తివిధివిచారము.

వానిలోఁ బ్రమాణాంతరముచేఁ బ్రాప్తింపని కర్మముయొక్క స్వరూపముమాత్రముబోధించువిధి 'ఉత్పత్తివిధి'యనఁబడును, ఉదా॥ "అగ్నిహోత్రం జుహోతి" (=అగ్నిహోత్రమను హోమము నాచరించుటచే నిష్టమునుత్పాదించునది) ఈవిధియందు హోమమునుకర్మము [47] భావనయందుఁ గరణముగా నన్వయించుచున్నది. కాఁగా నీ విధినుండి 'అగ్నిహోత్రమను హోమముచే నిష్టము నుత్పాదించుకొనవలసినది' అనునర్థమేర్పడుచున్నది "ఓయీ! యాగమునకు ద్రవ్యము [48] దేవత యను రెండు రూపములు గలవు. కావున నట్టిస్వరూపములే 'అగ్నిహోత్రం జుహోతి' అను విధియందు వినఁబడుటలేదు గాన నీవిధి యెట్లు 'ఉత్పత్తివిధి' కాఁగలదు? ఈవిధియందలి 'అగ్నిహోత్ర' పదమన్ననో, ముందువివరింపఁబోవు 'తత్ప్రఖ్యము' అను న్యాయముచే హోమమునకు నామధేయమని నిర్ణయింపఁబడినదిగదా!" అని శంకింపరాదు. ద్రవ్యము దేవతయు నను యాగస్వరూపములింకా లేకపోయినను నీ 'అగ్నిహోత్రం జుహోతి' అనువిధి యుత్పత్తివిధియే కాఁగలదు అట్లుగానిచో 'దధ్నా జుహోతి' యను విధియందు 'పెరుఁగు' అను యాగస్వరూపము వినఁబడుచున్నదిగాన నావిధియే యుత్పత్తివిధి కావలసివచ్చును. కాఁగా 'అగ్నిహోత్రం జుహోతి' అను వాక్యము వ్యర్థమయ్యెడిని.

## వినియోగవిధి విచారము.

[49] అంగములకును [50] ప్రధానమునకును గల సంబంధమును బోధించు విధి వినియోగవిధి యనఁబడుచున్నది. ఉదా॥ 'దధ్నా జుహోతి' (=పెరుఁగుతో హోమమును జేయుటచే నిష్టము నుత్పాదింపవలయును. ఈవిధివాక్యము 'దధ్నా' (=పెరుగుతో) అను పదమందలి తృతీయావిభక్తిచే 'అంగ' మని తెలియఁజేయఁబడిన దధికి (పెరుఁగునకు) హోమముతో సంబంధముండవలసినదని విధించుచున్నది. ఈ విధివాక్యమునుండి 'పెరుఁగుతో హోమమును జేయునది' అని యర్థము సిద్ధించుచున్నదిగదా! గుణవిధియందలి భావనయందు [51] ధాతువునకర్థమగు కర్మము [52] సాధ్యముగా నన్వయించును. ఒకానొకచోట ధాత్వర్థమాశ్రయముగాఁగూడ నన్వయించును. ఉదా॥ [53] "దధ్నేంద్రియకామస్య జుహుయాత్" (=ఇంద్రియమునుగోరువాఁడు దధితో హోమము జేయుటచే నిష్టము నుత్పాదింపవలయును.) అను విధినుండి 'దధియందుండు [54] కరణత్వముమూలముగా నింద్రియము నుత్పాదించునది' అనియర్థ మేర్పడుచున్నది అట్టి దధియందుండు కరణత్వము దేనినాశ్రయించి యుండవలసినదని యాకాంక్షకలుగఁగా, విధివాక్యమునందు 'దధ్నా' అను పదమునకు దగ్గఱనుండు ధాత్వర్థమగు హోమమమాశ్రయముగా నన్వయించుచున్నది. కావున నీవిధివాక్యమునందు, 'హోమమునాశ్రయించిన దధియందుండు కరణత్వముమూలముగా నింద్రియము నుత్పాదించునది' యను నర్థము సిద్ధించుచున్నది.

## శ్రుతిమున్నగు నాఱు ప్రమాణములు.

ఈవినియోగవిధికి సహాయముచేయుటకు 1 శ్రుతి, 2 లింగ

---

47. భావన=అర్థభావన=ఇష్టభావన. 48. ద్రవ్యదేవతేహి యాగః=ద్రవ్యము దేవతయను నీరెండింటి కూడికయే యాగమని శాస్త్రమందుఁ జెప్పఁబడినది.

49. అంగములు=ద్రవ్యములు దేవత మున్నగునవి. 50. ప్రధానము=ప్రధానయాగము. 51. ధాతువునకర్థములు=యాగము దానము హోమము మున్నగుకర్మములు. 52. ధాత్వర్థమగు కర్మము గుణవిధియందు సాధ్యముగానే యన్వయించును గాని యుత్పత్తివిధియందును అధికారవిధియందునువలె సాధనముగా నన్వయింపదు.

53. 'ఇంద్రియకామస్య' అనుపదమునందలి షష్ఠీవిభక్తి ప్రత్యయమును ప్రథమావిభక్తిగా మార్చుకొని యాపదమునకు 'ఇంద్రియమును గోరువాఁడు' అని యర్థము చెప్పుకొనవలెను. 54. కరణత్వము=సాధనమగుట.

ము, 3 వాక్యము, 4 ప్రకరణము, 5 స్థానము, 6 సమాఖ్య యను నాఱు ప్రమాణములుగలవు. వీని సహాయముగలిగిన యీవినియోగ విధిచే, 'వేఱొకదాని నుద్దేశించి ప్రవర్తించినవాని ప్రయత్నముచే సాధింపఁబడుట' యనునదియు, '[55] పారార్థ్య' మను నామాంతరము గలదియునగు [55A] 'అంగత్వము' తెలియఁజేయఁబడుచున్నది.

శ్రుతియను ప్రమాణము.

శ్రుతియనఁగా, దేనియపేక్షయులేక స్వతంత్రముగాఁ బ్రవర్తింపఁజేయుశబ్దము. ఆశ్రుతి (1) 'విధాత్రి' (2) 'అభిధాత్రి' (3) 'వినియోక్త్రి' అని మూఁడువిధములు గలిగియున్నది. (1) వానిలో మొదటిదగు 'విధాత్రి' యనుశ్రుతి, [56] లిఙ్మున్నగు ప్రత్యయముల రూపముగానుండునది. (2) రెండవదగు 'అభిధాత్రి' యనుశ్రుతి "వ్రీహిభిర్యజేత" ఈ మొదలగు విధులయందలి వ్రీహిమున్నైన వాని విధానము (3) వినియోక్త్రియను శ్రుతియనఁగా:- ఏశబ్దమును వినుటచేతనే దానిదగ్గఱనుండు శబ్దమునకర్థమగు ద్రవ్యమునకును, దానుండు వాక్యమందలి క్రియకునుగల సంబంధము తెలియుచున్నదో యట్టిశబ్దము. ఆవినియోక్త్రియను శ్రుతియు, (i) 'విభక్తిశ్రుతి' (ii) 'ఏకాభిధానశ్రుతి' (iii) 'ఏకపదశ్రుతి' అనిమూఁడువిధములుగానున్నది. (i) వానిలో విభక్తిశ్రుతియంగమును బోధించుననుట కుదాహరణము-"వ్రీహిభిర్యజేత" (=వ్రీహులతో యజించుటచే నిష్టమునుత్పాదింపవలెను.) ఇచట 'వ్రీహిభిః' (వ్రీహులచేత) అను పదమునందలి తృతీయావిభక్తియను శ్రుతిచే వ్రీహులు యాగమున కంగములని తెలి

55. పర (ఇతర) మగుదానికొఱకగునది పరార్థము. పరార్థమగుటయే పారార్థ్యము కావున 'పారార్థ్య' మనఁగా 'నితరమైనదానినిమిత్తమగుట' అని యర్థము. 55 a అంగత్వము = అంగమగుట.

56. లిఙ్, లోట్, తవ్య అనునవి.



యుచున్నది. వ్రీహులు, యాగమున కావశ్యకమగు పురోడాశమునకుఁగావలసిన ముఖ్యద్రవ్యమగుటచే యాగమునకంగములగుచున్నవి. పశువు, హృదయము మొదలైన ద్రవ్యరూపమగు హవిస్సున కావశ్యకమగు పదార్థమగుటచే యాగమున కంగమగునట్లే, యిచట వ్రీహులుగూడ యాగమున కంగములగుచున్నవి. "అరుణయా పింగాక్ష్యా ఏకహాయన్యా (గవా) సోమంక్రీణాతి" (=ఎఱ్ఱనిదియుఁ బచ్చనికన్నులుగలదియు, నొకసంవత్సరమువయసుగలదియునగు గోవుచే (=గోవునిచ్చి) సోమమును గొనునది.) అనువాక్యమందు 'అరుణయా' అను పదమందలి తృతీయావిభక్తియనెడి శ్రుతిచే 'ఆరుణ్యము' (=ఎఱ్ఱనిరంగుకలదగుట) కూడ, సోమమును గొనుట కంగమని తెలియఁజేయఁబడుచున్నది. ఇచ్చట, 'ఆరుణ్యము,' తాను 'ఆకారము' గల ద్రవ్యము కాకపోవుటచే, గోవను ద్రవ్యమును నిర్ణయించుటమూలముగా సోమక్రయమున కంగమగుచున్నదిగాని, స్వయముగా నంగముకానేరదు.

ద్వితీయావిభక్తియను శ్రుతి కుదాహరణము:- "వ్రీహీన్ ప్రోక్షతి" (=వ్రీహులను బ్రోక్షించుటచే నిష్టమునుత్పాదించుకొనవలసినది) అను విధియందు 'వ్రీహీన్' (=వ్రీహులను) అను పదమునందలి ద్వితీయావిభక్తియను శ్రుతిచే 'ప్రోక్షణము' వ్రీహుల కంగమని తెలియుచున్నది. ప్రోక్షణములేకున్నను వ్రీహుల స్వరూపము సిద్ధింపఁగలదుగాన, నిచట 'ప్రోక్షణము' వ్రీహులస్వరూపము సిద్ధించుటకై చేయఁబడునదికాదు. మఱేమన, వ్రీహులమూలముగా యాగమునకొక యపూర్వమును సిద్ధింపఁజేయుటకే ప్రోక్షణము చేయఁబడును. వ్రీహులను బ్రోక్షింపక యాగము నాచరించినచో నాయపూర్వము సిద్ధింపనేరదుగదా! ఇట్లే యన్నియంగములును యాగమునకావశ్యక

మగు నపూర్వముకొఱకే యుపయోగించునని తెలియందగినది. ఇటులనే "ఇమామగృభ్ణన్ రశనామృతస్యేత్యశ్వాభిధానీ మాదత్తే" (= 'ఇమాం ఋతస్య' అను [57] మంత్రముచే 'అశ్వరశన'ను [A] గ్రహించునది) అను విధియందు 'అశ్వాభిధానీం' అను పదమందలి ద్వితీయావిభక్తియనెడు శ్రుతిచే నీమంత్రమశ్వరశనకంగమని తెలియఁజేయఁబడుచున్నది. సప్తమీవిభక్తిశ్రుతి కుదాహరణము:- "యదాహవనీయే జుహోతి" (=ఆహవనీయమను నగ్నియందు హోమముచేయవలయునను నది) అను విధివాక్యమందు 'ఆహవనీయే' అను పదమందలి సప్తమీవిభక్తియనెడి శ్రుతిచే [58] 'ఆహవనీయము' హోమమున కంగమని తెలియుచున్నది ఇట్లే [59] యితరస్థలములయందుఁగూడ విభక్తియనెడు శ్రుతిచే 'అంగము' నిరూపింపఁబడునని తెలియఁదగినది.

---

57. 'ఇమా అగృభ్ణన్ రశనాం ఋతస్య=సత్యమగుఫలమును గలుగఁజేయునదగుటచే సత్యమనదగు (చయన) యాగమునకు సంబంధించు నీరశనను (అధ్వర్యుఁడు) తీసికొనెను. రశన=త్రాడు ఈచయనయాగసందర్భమందు 'అశ్వరశన, గర్దభరశన' అను రెండురశనలు వేదిదగ్గఱనుంపఁబడును. వానిలో నశ్వరశనను 'ఇమాం' అను పైమంత్రముతోను, గర్దభరశనను మంత్రమునుచ్చరింపకయుఁ దీసికొనవలయును. 57 a చయనయాగమునందు 'ఉఖ' యను కుండమును నిర్మించుటకుఁ గావలసిన మట్టిని దీయుప్రదేశమునకొక గుఱ్ఱమును దీసికొనిపోయి దానిచే నాప్రదేశమును ద్రొక్కించి పిదప నచటిమట్టి త్రవ్వి యొకగాడిదపైవేసి తీసికొనివత్తురు. గుఱ్ఱమునకుఁగట్టుత్రాడు 'అశ్వరశన' యనియు, గర్దభమునకుఁగట్టుత్రాడు 'గర్దభరశన' యనియుఁ జెప్పంబడును.

58 'ఆహవనీయము, దక్షిణాగ్ని, గార్హపత్యము' నను నీమూడగ్నులకును 'త్రేతాగ్నులు' అని పేరు. వినిలో నాహవనీయమునందే యాగసంబంధములగు హోమములు విశేషముగా జరుపఁబడును.

59. ఇతరస్థలములు:-'దధ్నా జుహోతి' 'పయసా జుహోతి' అను విధులయందు 'దధ్నా' 'పయసా' అను పదములందలి తృతీయావిభక్తి శ్రుతులచే దధియు, పయస్సును, హోమమునకంగములని తెలియుచున్నవి.



(ii) ఏకాభిధాన శ్రుతి కుదాహరణము :- "పశునాయజేత" (=పశువుతో యజించుటచే నిష్టమునుత్పాదింపవలెను.) అనువాక్యమందు 'పశునా' (=పశువుచేత.) అను పదమందలి తృతీయాశ్రుతి, పశువునందుండు నేకత్వము, పుంస్త్వము నను నీరెండింటికి [60] సమానాభిధానమగుచున్నది గాన నిచట [60A] నేకాభిధానశ్రుతిచే నీరెంటును పశువను కారకమున కంగములని తెలియుచున్నది 'యజేత' అనుపదమునందలి 'త' ప్రత్యయమను నాఖ్యాతముచేఁ దెలుపఁబడినసంఖ్య, (ఆ 'త' ప్రత్యయముచేతనే, లిఙ్గమూలముగా [61] భావనకూడఁ దెలియఁజేయఁబడునుగావున) సమానాభిధాన (=ఏకాభిధాన) శ్రుతిచే భావనకును, (నదేపదమునందలి 'యజ్' ధాతువుచే యాగము తెలుపంబడునుగావున) ఏకపదశ్రుతిచే యాగమునకును, నంగమగుచున్నది. " 'సంఖ్య,' యాకారముగలద్రవ్యము కాదుగనుక నదియెట్లు భావనకంగము కాఁగలదు" అని శంకింపరాదు. సంఖ్య, భావనయొక్క కర్తను నిర్ణయించుటమూలముగా నాభావన కంగము కాఁగలదు గదా! భావనకుఁగర్తకలఁడని [62] యర్థాపత్తి ప్రమాణముచేఁగాని,

---

60 'పశునా' అను నొకేపదము, పశుశబ్దముమూలముగాఁ బశుద్రవ్యమునకును, తృతీయావిభక్తి ప్రత్యయముమూలమున నేకత్వపుంస్త్వములకును నేకాభిధానము [=అభిధాయకమగు= తెలియఁజేయు నొకేపదము] అగుచున్నది. కావున 'ఏకపదశ్రుతి' చే ఏకత్వపుంస్త్వములు రెండును బశుద్రవ్యమున కంగములగుచున్నవి కనుక 'పశునా యజేత' అను వాక్యమునందలి పశునా అను పదము ఏకాభిధానశ్రుతికిని, ఏకపదశ్రుతికినిగూడ నుదాహరణము కావచ్చును.

61. భావన=అర్థభావన. 62. ఏదిలేనియెడల నేది సిద్ధింపదో యది దానిచే గ్రహింపఁజేయఁబడుచున్నది. ఉదా॥ 'దేవదత్తుఁడు బలిసియున్నాఁడు పగలు భుజింపఁడు' అనునది వినినతోడనే, దేవదత్తుఁడు రాత్రిభుజింపనియెడలఁ దాను బలిసియుండుట సిద్ధింపదు గాన, నట్లు వాఁడు బలిసియుండుటవలన 'రాత్రి భుజించుచున్నాఁడు' అనునది గ్రహింపఁజేయఁబడుచున్నది. ఇట్లు గ్రహింపఁజేయునట్టి ప్రమా

[63] యనుమానప్రమాణముచేఁగాని నిర్ణయింపఁదగును.

ఆఖ్యాతముచేత (కర్తృవ్యాపారమగు) నర్థభావన చెప్పంబడుచున్నది. అట్టిభావన, కర్తలేనిచో సిద్ధింపనిదై, మీఁదనుదాహరింపఁబడిన 'యాక్షేప' మను ప్రమాణముచేఁ గర్తకలఁడని తెలియఁజేయుచున్నది. ఇంతవఱకును వివరముగా నిరూపింపఁబడిన శ్రుతి ప్రమాణము, లింగము మున్నగు ప్రమాణములకంటె బలవత్తరమయినది. అదియెట్లంటేని- లింగాది ప్రమాణములయందు, వినియోగింపఁజేయు ప్రత్యక్షమగు శబ్దము లేదు. మఱియేమన నట్టివినియోగింపఁజేయు శబ్దమును గల్పింపవలసియున్నది. లింగాదిప్రమాణములచే, వినియోగింపఁజేయు శబ్దము కల్పింపఁబడునంతలోఁ బ్రత్యక్షమగు శ్రుతిచే, నావశ్యకమగు వినియోగము జరుపఁబడుటవలన, లింగాదులకుఁగల శ్రుతిని గల్పించుశక్తి క్షీణమగుచున్నదిగదా! కావుననే యింద్రుఁడు దేవతగాఁగల "కదాచన స్తరీరసి నేంద్ర సశ్చసి దాశుషే" (ఓయింద్రా! నీ వెప్పుడును మాకు హానిచేయువాఁడవు కావు. నీకొఱకు హవిస్సు నిచ్చు యజమానుని కుపకరించుచున్నావు.) అను ఋక్కు లింగప్రమాణము

ణమునకు 'అర్థాపత్తి' అని పేరు. ఇచటఁ గర్తలేనిచో భావనయుండుట సిద్ధింపదు గాన భావనయుండుటవలనఁ గర్తకూడ నుండునని యీయర్థాపత్తిప్రమాణముచే నిర్ణయింపనగును. లేదా?

63. ధూమమున కగ్ని కారణము గనుక, ధూమమును జూచిన చోటులందెల్ల నగ్ని తప్పకయుండునని యూహింపనగును. ఇట్టియూహకు హేతువైన ధూమమునకు 'అనుమానప్రమాణము' అని పేరు. ఈయనుమానప్రమాణము నవలంబించుటచేతనే కార్యమగు భావనయను హేతువువలనఁ గారణమగు కర్తయను సాధ్యమూహింపఁబడును. కాఁగా నర్థాపత్తిప్రమాణముచేఁగాని, యనుమానప్రమాణముచేఁగాని, 'భావనకుఁ గర్తగలఁడు' అనునది సిద్ధించుచున్నది. అర్థాపత్తిప్రమాణమునకే 'ఆక్షేపము' అని నామాంతరము గలదు.



చే [64] నింద్రోపస్థానమునకంగమగునని చెప్పుట తగదు. మఱేమన- 'ఐంద్ర్యా గార్హపత్యముపతిష్ఠతే' (=ఇంద్రుఁడు దేవతగాఁగల ఋక్కుచే గార్హపత్యమను నగ్నిని సేవించునది) అను వాక్యమందు 'గార్హపత్యమ్' (=గార్హపత్యమనునగ్నిని) అను పదమందలి ద్వితీయావిభక్తి యనెడి శ్రుతిచేతను, ఐంద్ర్యా (=ఇంద్రునిస్తుతించుఋక్కుచేత) అను పదమందలి తృతీయావిభక్తిశ్రుతిచేతను 'కదాచన స్తరీరసి' ఈమున్నగు ఋక్కు గార్హపత్యోపస్థానమునకంగమని తెలియుచున్నది.

లింగమను ప్రమాణము.

లింగమనఁగా శబ్దమునందుండునట్టియు, నర్థమును బ్రకాశింపఁజేయునట్టియు సామర్థ్యము. "శబ్దములన్నిటియందునుండునట్టియు నర్థమును బ్రకాశింపఁజేయునట్టియు సామర్థ్యము లింగమనబడును." అని పెద్దలు చెప్పుదురుగదా! సామర్థ్యమనఁగా, శబ్దమందుండునట్టియు, శబ్దావయవములమూలముగాఁగాక, యనాదియగు సంకేతముచేఁగల్పింపఁబడిన యర్థమును దెలియఁజేయునట్టియు శక్తివిశేషము. కావుననే యిది సమాఖ్యయను ప్రమాణముకంటె వేఱగుచున్నది. ఇట్టి సామర్థ్యమగు లింగప్రమాణము [65] యౌగికశబ్దమగు సమాఖ్యకంటె [66] విలక్షణమైనదిగదా! కావున "బర్హిర్దేవసదనం దామి" (=దేవతలకిష్టమగు పురోడాశమునకు స్థానముకాఁబోవు బర్హిస్సును ఛేదించుచున్నాను.) అను మంత్రము లింగప్రమాణముచే కుశలను ఛేదించుట యను కర్మమునకే యంగమగుచున్నది గాని, బర్హిశ్శబ్దమునకు తుంగమున్నగునవికూడ నర్థమగునుగదాయని, సమాఖ్యయను

64. ఇంద్రుని సేవించుట, లేక ప్రార్థించుట.

65. తనయందలి యవయవార్థమును బోధించు శబ్దము. ఉదా:- పాచకుఁడు =పచనక్రియనుజేయువాఁడు అనునట్లు- 66. విలక్షణమైనది=భిన్నమైనది=వేఱయినది.

ప్రమాణముచే తుంగమున్నగువానిని ఛేదించుటయను కర్మముకంగ మగునని చెప్పుటకు వీలులేదు. ఈమంత్రము "బర్హిః దామి" (=కుశలను ఛేదించుచున్నాను) అను పదములందలి [67] కుశలవనమనెడి యర్థమును బ్రకాశింపఁజేయు సామర్థ్యమనెడు లింగప్రమాణముచే, 'కుశలవన' మను నర్థమును దెలియఁజేయుటకు సమర్థమగుచున్నది గదా! ఇట్లే [68] యితరస్థలములయందుఁగూడ లింగప్రమాణముచే 'మంత్రము కర్మములకంగముగా వినియోగించును' అని తెలియఁజేయఁబడుచున్నది. అట్టి యీలింగప్రమాణము, వాక్యము మున్నగు ప్రమాణములకంటె బలవత్తరమగుచున్నది. కావుననే "స్యోనం తే సదనం కృణోమి" (=ఓపురోడాశమా! నీకొఱకుఁ బ్రశస్తముగుస్థానమును నిర్మించుచున్నాను) అను మంత్రము, 'సదనం కృణోమి' అను పదములయందలి 'స్థానము నిర్మించుట' అనెడి యర్థమును బ్రకాశింపఁజేయు సామర్థ్యమనెడు లింగప్రమాణముచేతనే, స్థానమును నిర్మించుటయను క్రియకంగమగుచున్నదిగాని, వాక్యప్రమాణముచే [69] మఱియేక్రియకును నంగమగుటలేదు.

---

67. కుశలవనము—కుశ=దర్భలను, లవనము=ఛేదించుట.

68. "అగ్నయే జుష్టం నిర్వపామి" (=అగ్నికొఱకు నిష్టమగు పురోడాశమును రాశినుండి వేఱుపఱుచుచున్నాను.) అను మంత్రము, 'నిర్వపామి' అను పదమునందలి నిర్వపించుట (=వేఱుపఱుచుట) యను నర్థమును బ్రకాశింపఁజేయు సామర్థ్యమనెడి లింగప్రమాణముచే, నిర్వాపక్రియకంగమగుచున్నది.

69. ఈమంత్రము వాక్యప్రమాణముచే వినియోగింపఁబడినయెడల "స్యోనం తే సదనం కృణోమి" అనువానికి, "తస్మిన్ సీద" (=దానియందుఁ గూర్చుండుము) అనుమంత్రమును జేర్చి, రెండింటిని నొకేవాక్యముగా నన్వయించి, "పురోడాశమా! నీకొఱకు శ్రేష్ఠమైన స్థానమును నిర్మించుచున్నాను గనుక, దానియందుఁ గూర్చుండుము" అనునర్థము లభించుచున్నదిగాన, 'కూర్చుండుము' అను పదమందు లింగమును గల్పించి, దానిచే నీమంత్రమును 'కూర్చుండఁబెట్టుట' యను క్రియకంగముగా విని



## వాక్యమనెడు ప్రమాణము.

సమభివ్యాహారము వాక్యము; సమభివ్యాహారమనఁగా సాధింపఁబడుట మున్నగు ధర్మములను బోధించు ద్వితీయాదివిభక్తులు లేకున్నను, వాస్తవముగా [70] శేష [71] శేషులను దెలియఁజేయుపదముల రెండింటిని జేర్చి పలుకుట. ఉదాహరణము:— "యస్య పర్ణమయీ జుహూర్భవతి న స పాపగ్గ్ శ్లోకగ్ శృణోతి" (=ఎవనియొక్క [72] 'జుహు' వను పాత్రము పర్ణవృక్షముతోఁ జేయఁబడునో, యతఁడు పాపకరములగు వాక్యములను వినఁడు.) ఇచట [73] 'పర్ణవృక్షముతోఁ జేయఁబడుట', 'జుహువు' అను రెండుపదములను జేర్చి యుచ్చరించుటచేతనే, 'పర్ణవృక్షముతోఁ జేయఁబడుట' యనునది జుహువునకంగమగుచున్నది. జుహువు మఱియొకవృక్షముచేఁగూడఁ జేయఁబడవచ్చును గాన, 'పర్ణవృక్షముచేఁ జేయఁబడుట' యనునది, వ్యర్థమయ్యెడినని శంకింపరాదు. ఇచట జుహువను శబ్దమునకు, జుహువనెడి పాత్రముచే జనింపఁజేయఁబడు నపూర్వమర్థమని తెలియునది. కాఁగాఁ బై వాక్యమునుండి, "జుహువను పాత్రము, పర్ణవృక్షముతోఁ జేయఁబడి వేఱుపఱుపఁబడిన హవిస్సును ధరించును గనుక, యజమానుఁడా జుహువువలన జనింపఁదగిన యపూర్వమును సాధింపవలయును." అను నర్థము లభించుచున్నది. కావున, "జుహువు పర్ణవృక్షముతోఁ జేయఁబడినప్పుడే, యాజుహువువలన జనింపఁదగిన యపూర్వము సిద్ధించును. అట్లుకాక, మఱియొక కఱ్ఱతోఁ జేయఁబడినచో నట్టి యపూర్వము కలుగదు" అని యర్థము సిద్ధించుచున్నది గనుక 'పర్ణవృక్షముతోఁ జేయఁబడుట' అనునది వ్యర్థము కానేరదు. పై నివివ

---

యోగింపఁజేయవలసివచ్చును. 70. శేషము=అంగము. 71. శేషి=ప్రధానము.

72. ఆజ్యముతో హోమముచేయునట్టి యజ్ఞపాత్రవిశేషము.

73. మోదుగుచెట్టు.

రింపఁబడిన వాక్యార్థమునందు "జుహువు 'అవత్త' మగు హవిస్సును ధరించును గనుక" అని నిశ్చితముగాఁ జెప్పవలయును. లేనిచో 'పర్ణవృక్షముచేఁ జేయఁబడుట యనునది [74] స్రువము మున్నగు పాత్రములకుఁగూడ నావశ్యకము కావలసివచ్చును. అట్టి యీపర్ణవృక్షముతోఁ జేయఁబడుట యనునది, యేసందర్భమును ప్రత్యేకముగా నుద్దేశించి చెప్పఁబడనిదైనను, ప్రకృతి యాగములందెల్ల నన్వయించును. కాని వికృతియాగములయందన్వయింపదు. "ప్రకృతియాగమువలెనే వికృతియాగమును జేయునది" అను విధివాక్యముచేత 'పర్ణవృక్షముతోఁజేయఁబడుట' అనునది వికృతియాగములందుఁగూడ లభించును గాన 'పర్ణవృక్షముతోఁజేయుట' అనుదానిని విధింపఁజేయువిధి, వికృతులందుఁగూడఁ బ్రవర్తించినచో, నచట నీధర్మమునకుఁ [75] బునరుక్తిదోషము సంభవించెడినిగదా! దేనియందంగములన్నియు నుపదేశింపఁబడునో యాయిష్టి [76] ప్రకృతి. ఉదా॥ దర్శపూర్ణమాసేష్టులు. దర్శపూర్ణమాసేష్టుల సందర్భమునం దంగములన్నియు విధింపఁబడినవిగదా! దేనియందంగములన్నియు నుపదేశింపఁబడవో యది వికృతి. ఉదా॥ 'సౌర్యేష్టి' మున్నగు 'ఇష్టులు'. ప్రకృతియందుపదేశింపఁబడిన కొన్నియంగములు ప్రకృతియందువలె నీసౌర్యాదులగు 'ఇష్టు' లయందుఁగూడఁ బ్రవర్తించునుగదా! 'అనారభ్యవిధి' యనఁగా నేసందర్భమును ప్రత్యేకముగా నుద్దేశింపక సామాన్యముగాఁ జెప్పఁబడిన విధి. అట్టి యీవాక్యప్రమాణము ప్రకరణము మున్నగు నితరప్రమా

74. స్రువమనగా నేతిగిన్నెలోనుండి నేతిని దీసి జుహువనుపాత్రములో నుంచుట కుపయోగించు చిన్నగరిటవంటి యజ్ఞపాత్రము.

75. పునరుక్తి = ఒకేయర్థమును ఒకేశబ్దముచేఁగాని వేఱుశబ్దములచేఁగాని రెండుమారులు చెప్పుట.

76. ప్రకృతి = యాగములందు జ్యోతిష్టోమము ప్రకృతి. మిగిలిన వన్నియు వికృతులు.



ణములకంటె బలవత్తరమగునది. కావుననే "ఇంద్రాగ్నీ ఇదం హవిరజుషేతామ్" (=ఇంద్రాగ్నులిద్దఱును నీహవిస్సును బొందిరి) ఈమున్నగు మంత్రమొకేవాక్యముగనుక వాక్యప్రమాణముచే దర్శేష్ట్యంగమగుచున్నది; కాని ప్రకరణప్రమాణముచే దర్శపూర్ణమాసలకంగమగునని చెప్పుటకు వీలులేదు.

### ప్రకరణమను ప్రమాణము.

రెండువస్తువులకొండొంటితోఁగల [77] యాకాంక్ష ప్రకరణము. ఉదా॥ ప్రయాజాదులను విధించు "సమిధోయజతి" ఈమున్నగు విధివాక్యములందుఁ బ్రత్యేకఫలమేమియు నిర్దేశింపఁబడక (తెలియపఱుపఁబడక) పోవుటవలన, "సమిధోయజతి" అనువాక్యమునుండి సమిత్తను దేవతనుద్దేశించి చేయఁబడు యాగముచేత నుత్పాదింపవలయును" అనునర్థము తెలిసినవెంటనే, 'దేనిని ఉత్పాదింపవలయును' అని యీ [78] సమిద్భాగముచే నుపకరింపఁబడుదానినిగూర్చి యాకాంక్ష కలుగుచున్నది. [79] దర్శపూర్ణమాసేష్టులను విధించు "దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత" అనువాక్యమునుండి కూడ "స్వర్గమునుగోరువాఁడు దర్శపూర్ణమాసలను నిష్టులచే స్వర్గమునుత్పాదించునది" అనునర్థము తెలిసినవెంటనే యీ యిష్టులచే స్వర్గమును "ఎట్లు" ఉత్పాదింపవలయును? అని యీయిష్టులకుపకరించుదానినిగూర్చి యాకాంక్ష కలుగుచున్నది. ఇట్లీ [80] రెండింటికిని బరస్పరమును గలుగు నాకాంక్షయనెడు ప్రకరణప్రమాణముచేఁ బ్రయాజాదులు దర్శపూర్ణమాసేష్టులకంగములగుచున్నవి.

77. ఆకాంక్ష = సంబంధించుకోరిక. 78. సమిద్భాగము = 'సమిత్తు' అనుదేవత నుద్దేశించి జేయఁబడు యాగము. 79. దర్శపూర్ణమాసేష్టులు :- దర్శ = అమావాస్య. దర్శకుమరుసటిదినమునఁజేయు 'ఇష్టి' 'దర్శేష్టి' యనఁబడును., పూర్ణమాసము = పూర్ణిమ పూర్ణమాసకు మరుసటిదినమునఁజేయు 'ఇష్టి' కి 'పూర్ణమాసేష్టి' యనిపేరు.

80. దర్శపూర్ణమాసేష్టులు ప్రయాజాదులనను రెండు.

ఈప్రకరణము (i) 'మహాప్రకరణము (ii) 'అవాంతర ప్రకరణము' నని రెండువిధములుగా నున్నది.

### (i) మహాప్రకరణము.

స్వర్గాదిఫలముల నుత్పాదించుట యను ఫలభావనకు సంబంధించు ప్రకరణము మహాప్రకరణము. 'దర్శపూర్ణమాసేష్టులచే స్వర్గము నుత్పాదించుట' యనునది ఫలభావన గనుక మహాప్రకరణముచేఁ బ్రయాజాదులు దర్శపూర్ణమాసేష్టుల కంగములగుచున్నవి. ఉభయాకాంక్ష ప్రకృతులయందే యుండును గాన నీమహాప్రకరణము ప్రకృతులయందే ప్రవర్తించును గాని వికృతులయందుఁ బ్రవర్తింపనేరదు. "ప్రకృతివలెనే వికృతిచేయఁబడవలసినది" అను [81] 'అతిదేశము' చేతఁ బ్రకృతియందుపదేశింపఁబడిన యంగములే, వికృతియందుఁగూడ స్మరింపఁబడుటవలన, వికృతియందలి ప్రధానముల కావశ్యకమగు [82] కథంభావాకాంక్ష యుపశమించుచుండుటంజేసి, వికృతియందుభయాకాంక్ష కలుగనేరదుగదా! క్రొత్తగావిధింపఁబడిన ఉపహోమము మున్నగు [83] అపూర్వాంగములు గలిగిన సౌర్యేష్టి మొదలగు వికృతియాగములందుఁగూడఁ బ్రధానముల కావశ్యమగు కథంభావాకాంక్ష, ప్రకృతినుండి యతిదేశముచేఁ బ్రాప్తించు నంగములతోనే యుపశమించును గాన, నీయపూర్వాంగములకుభయాకాంక్షచే వినియోగము సంభవింపనేరదు. కావున నీయపూర్వాంగములు, వికృతులయందుపదేశింపఁబడుటంజేసి, యావికృతులయిన సౌర్యేష్టిమున్నగువాని కంగములగుచున్నవి.

81. అతిదేశము = ఒకదానియందు విధింపఁబడిన యంగములను మఱియొకదానియందు వేఱువిధానముక్కఱలేకుండఁ బ్రాప్తింపఁజేయుట. ఉదా॥ ప్రకృతియందు విహితమగు కొన్నియంగములను వికృతియందు మరల విధానమక్కఱలేకుండఁగఁ బ్రాప్తింపఁచేయుట

82. కథంభావాకాంక్ష = ఇత్థంభావాకాంక్ష = ఇతికర్తవ్యతాకాంక్ష—

83. అపూర్వాంగములు = ఇదివఱకు ప్రకృతియందు లేక యిపుడే క్రొత్తగా వికృతియందు విధింపఁబడిన యంగములు.



### (ii) అవాంతర ప్రకరణము.

'అంగములచే నిష్టము నుత్పాదించునది' అను అంగభావనకు సంబంధించు ప్రకరణము 'అవాంతర ప్రకరణము'. దానిచే [84] 'అభిక్రమణము' మున్నగు క్రియలు, ప్రధానమునకంగములగు ప్రయాజాదులకంగములగుచున్నవి. ఈవిషయము సందంశమను న్యాయముచేఁ దెలియఁజేయఁబడుచున్నది. ఆసందంశన్యాయమే ప్రవర్తింపనియెడల, విశేష (భేద) మేమియు లేకుండుటంజేసి, = ప్రధానముల సందర్భమునందుఁ బ్రయాజాదులువలె నీయభిక్రమణాదులుగూడవిధింపఁబడుటంజేసి, 'ప్రయాజాదులు', 'అభిక్రమణాదులు' మొదలగునవియన్నియు ఫలభావనయందలికథంభావాకాంక్షను బూరించుట కావశ్యకమగుటచేఁ బ్రధానములకే యంగములు కావలసివచ్చునుగదా!

ఏదేనొకయంగము ననువదించి (=దానినుద్దేశించి) విధింపఁబడి రెండంగముల నడుమను మఱియొకక్రియ విధింపఁబడుట సందంశమనఁబడుచున్నది. ఉదాహరణము:-అభిక్రమణమను క్రియ. అది యెట్లంటేని. ప్రయాజాదులననువదించి వానికొఱకు "సమానయతే జుహ్వాం ఉపభృతస్తేజో వా" (=[86] 'ఉపభృ'త్తనుపాత్రనుండి సగము

84. అభిక్రమణము = ప్రయాజాదుల నాచరింపఁబోవునపు డధ్వర్యుఁడు కొన్నియడుగులు నడచి యాహవనీయముదగ్గఱకుఁ బోవుట.

85. సందంశము = పట్టుకారు—దీనిచేఁబట్టఁబడు వస్తువు తనకిరుపార్శ్వములయందునుండు నినుపయూచలు రెండింటికి నధీనమైయుండునట్లు సమానజాతిగల రెండు వస్తువుల నడుమనుండు మఱియొకవస్తువుకూడ నదేజాతిలోఁ జేరునని నిర్ణయించుట సందంశన్యాయమనఁబడుచున్నది.

86. ఉపభృత్తు = జుహువువంటిదియు నాజ్యమునుంచునదియు హోమముచేయునపుడు జుహువుక్రింద నుంపబడునదియు నగు నొకయజ్ఞపాత్రము.

ఘృతమును దీసికొనివచ్చి జుహువను పాత్రియం దుంపవలసినది.) అను మంత్రముచే సగము ఘృతము నుపభృత్తను పాత్రినుండి తీసికొనివచ్చి జుహువునందుంచుట యను నంగమును విధించిన తరువాత, "యస్యైవం విదుషః ప్రయాజా ఇజ్యంతే ప్రైభ్యో లోకేభ్యో భ్రాతృవ్యాస్తుదతేఽభిక్రామం జుహోత్యభిజిత్యై" (=ఇట్లు తెలిసికొని ప్రయాజాదుల నాచరించువాఁడు శత్రువుల నీలోకమునుండి వెడలఁగొట్టి జయము నొందును. ఇట్టి జయముకొఱకు 'అభిక్రమణ' మను క్రియను జేసి హోమముల నాచరింపవలయును.) అను వాక్యముచే 'అభిక్రమణ' మను క్రియ విధింపఁబడుచున్నది దీనియనంతరమే "యో వై ప్రయాజానాం[87] మిథునం వేద" (=ఎవఁడు ప్రయాజములు జంటలుగానుండుటను. తెలిసికొనుచున్నాఁడో) అను వాక్యముచే నొకయంగము విధింపఁబడుచున్నది. కాఁగా, నిచట మొదటిదియు మూఁడవదియు నగు ప్రయాజాంగముల మధ్య విధింపఁబడిన 'అభిక్రమణ' మనునది సందంశన్యాయముచేఁ బ్రయాజాదులకంగమగుచున్నది.

'ప్రయాజాదులచే నపూర్వమును జనింపఁజేసి ప్రధానయాగమున కుపకారము నుత్పాదింపవలయును' అని తెలియఁగా, 'వీనిచే నపూర్వము నెట్లు జనింపఁజేయవలెను' అను కథంభావాకాంక్ష గలుగుచున్నది గావున, నట్టియాకాంక్ష 'ప్రయాజాంగముల మధ్య నుండుట' యను సందంశము రీతిని పఠింపఁబడిన యభిక్రమణాదులచే నివర్తింపఁజేయఁబడుచున్నది. అంగభావనయందుఁ గథంభావాకాంక్షయుండదనుట తగదు. ఆభావన ఫలభావనతో సమానముగు భావనయే కనుక దానియందుఁగూడఁ గథంభావాకాంక్ష కలుగును గదా! అట్టి యాప్రకరణము సాక్షాత్తుగాఁ గ్రియ నీయంగముగా వినియోగింపఁజేయును. ద్రవ్యమును గుణమును మాత్రము సాక్షాత్తుగాఁ గాక యేదేనొక క్రియ

87. సమిత్ + తనూనపాత్ = ఒకజంట; ఇట్ + బర్హిస్ = మఱియొకజంట.



మూలముగా అంగమగునట్లు వినియోగింపఁజేయును. అది యెట్లంటేని:- "యజేత స్వర్గకామః" (=స్వర్గమును గోరువాఁడు యాగముచే నిష్టము నుత్పాదింపవలయును.) అను వాక్యమందలి ఫలభావనయందు 'కథంభావాకాంక్ష' కలుగఁగా, దీని సమీపమునఁ బఠింపఁబడినదియు, ఫలము నుత్పాదించునదిగాఁ దెలియఁబడనిదియు నగు క్రియాసముదాయమునకు 'తనచే నుపకరింపఁబడునదేది' యని[88] ఉపకార్యమును గూర్చిన యాకాంక్ష కలుగును గాన, నీక్రియాసముదాయము ఫలభావనయందు ఇతికర్తవ్యతగా నన్వయించుచున్నది. లోకమందుఁ గ్రియయే కథంభావాకాంక్షను నివర్తింపఁజేయఁగలదని తెలియుచున్నది గదా! "హస్తేన కుఠారేణ ఛింద్యాత్" (=హస్తముచే గొడ్డలిని సాధనముగా నుపయోగించి ఛేదించునది.) అను భావనయందుఁ గథంభావాకాంక్ష కలుగఁగా, హస్తము వాక్యమందుచ్చరింపఁబడినదైనను నీయాకాంక్షను బూరించునట్లన్వయింపనేరదు. మఱేమన, 'హస్తముచే గొడ్డలి నెత్తి కఱ్ఱపైఁబడవేసి ఛేదించునది' అనునర్థమావశ్యకమగుచున్నదిగనుక, 'ఎత్తుట' 'పడవేయుట' అను రెండుక్రియలే పై యాకాంక్షను బూరించునట్లన్వయించుచున్నవి. హస్తముకూడ నాక్రియలమూలముగానే యాయాకాంక్షను బూరించునట్లన్వయించుచున్నది. ఇదియంతయు సర్వజనులకును దెలిసినవిషయమే గదా! ఈప్రకరణమను ప్రమాణము స్థానము మున్నగు నితరప్రమాణములకంటె బలవత్తరమైనది. కావుననే 'అక్షైర్దీవ్యతి', 'రాజన్యం జినాతి', 'శౌనశ్శేఫమాఖ్యాపయతి', (=పాచికలతో నాడవలయును. రాజులను జయింపవలెను. శునశ్శేఫుని కథను జెప్పించునది.) అను వాక్యములచే విధింపఁబడు జూదమాడుట మొదలగు[89] ధర్మములు అనేకయాగ

88. ఉపకార్యము = ఉపకరింపఁబడునది.

89. ధర్మములు = అంగములగు కృత్యములు.

ముల సంఘరూపమగు రాజసూయయాగమందంతర్గతమైనదియు, 'అభిషేచనీయము' అను పేరుగలదియు, నగు సోమయాగవిశేషము యొక్క సమీపమందుఁ జదువఁబడినప్పటికిని, నవి స్థానమను ప్రమాణముచే 'అభిషేచనీయయాగము' నకంగములగునని చెప్పుటకు వీలులేదు. మఱేమనఁ బైనివివరింపఁబడిన ప్రకరణప్రమాణముచే రాజసూయయాగమునకే యంగములగుచున్నవి.

స్థానమను ప్రమాణము.

స్థానమనఁగా సమానమైన దేశమును గలిగియుండుట. (=దగ్గఱనుండుట) అది పాఠమునందు దగ్గఱగా నుండుటయనియు, 'అనుష్ఠాన' మందు దగ్గఱగా నుండుటయనియు రెండువిధములుగానున్నది. 'స్థానము, క్రమము' అనునవి సమానమగు నర్థముగల పదములు. పాఠమునందు దగ్గఱగానుండుట యనునదికూడ (i) [90] యథాసంఖ్యముగాఁ బఠింపఁబడుట. (ii) సన్నిధియందుఁ బఠింపఁబడుట యని రెండువిధములుగలది. వానిలో [1] "ఐంద్రాగ్నమేకాదశకపాలం నిర్వపేత్" (=ఇంద్రాగ్నులను వ్యాసక్తదేవతలకొఱకుఁ బదునొకండు కపాలములయందు సంస్కరింపఁబడిన పురోడాశమును [91] నిర్వపించుటచే నిష్టము నుత్పాదించునది) [2A] "వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేత్" (=వైశ్వానరుని కొఱకుఁ బండ్రెండు కపాలములయందు సంస్కరింపఁబడిన పురోడాశమును నిర్వపించుటచే నిష్టము నుత్పాదింపవలయును.) అను వాక్యములచే విధింపఁబడు 'ఐంద్రాగ్నేష్టియాగము' 'వైశ్వానరేష్టియాగము' అను నీరెంటిని నుద్దేశించి [1] "ఇంద్రాగ్నీ రోచనాదివ, వైశ్వానరః అజీజనత్" అను రెండు యాజ్యానువాక్యామంత్రములును వరుసగాఁ బఠింపఁబడినవి. కావున వీనిలో మొద

9 . పైనుండు క్రమమునను సరించి వరుసగా, 91. నిర్వపించుట = వేలుపఱచుట. (1a) మై. సం. 2-1-1 (2a) మై. సం. 2-1-2



టిమంత్రము పైవానిలో మొదటిదగు నైంద్రాగ్నయాగము నకును; రెండవమంత్రము రెండవదగు వైశ్వానరయాగమునకును నంగములగుచున్నవి. వీనిలో మొదటఁ బఠింపఁబడిన మంత్రమువిషయమై 'ఇది దేనినిమిత్తము' అనియాకాంక్షకలుగఁగాఁ బైనుదాహరింపఁబడిన కర్మములలో మొదటవిధింపఁబడిన (ఐంద్రాగ్నయాగమను) కర్మమే యథాసంఖ్యముగాఁ బఠింపఁబడిన దగుటచే; మొదటనే యీయాకాంక్షను బూరించునట్లన్వయించుటకు సిద్ధపడుచున్నది. ఇట్లే రెండవమంత్రవిషయమైకూడ కలుగునాకాంక్షను రెండవదగు వైశ్వానరయాగము పూరించుచున్నది. [92A] ప్రాకృతాంగములననువదించివిధింపఁబడినవియు, సందంశమురీతినిఁబడనివియునగు, [93] వైకృతాంగములు వికృతులసన్నిధిని బఠింపఁబడుటవలన వికృతులకొఱకేయగుచున్నవి. ఉదా:- [94] ఆమన హోమములు. ఈయామన హోమములవిషయమై 'ఇవి దేనికొఱకగుచున్నవి లేదా వీనికి [95] భావ్యమేది' అను నాకాంక్షకలుగఁగా, ఫలముగలదియు, వికృతులవలన జనించునదియునగు నపూర్వమే వెంటనే స్మరింపఁబడుటచే భావ్యముగానన్వయించుచున్నది. ఈ హోమములకు స్వతంత్రమగు ఫలముకలదని చెప్పినచో వీనిని వికృతులసన్నిధిని బఠించుటవ్యర్థముకావలసివచ్చునుగదా ! [96] ఉపాకరణ

92. (I) (మై. సం. 4-11-1) 92ఎ. ప్రకృతియందువిహితమగు 93. వికృతుల సన్నిధియందుఁ బఠింపఁబడినవి. 94. "వైశ్వదేవీం సాంగ్రహణీం నిర్వపేత్ గ్రామకామః" (గ్రామమునుగోరువాఁడు విశ్వేదేవులకొఱకు సాంగ్రహణియను హవిస్సును నిర్వపించుటచే నిష్టమునుత్పాదించునది) అను వాక్యముచే విధింపఁబడు కామ్యేష్టియాగమను వికృతియాగముయొక్క సన్నిధిని "అమనసేస్వాహా" "రేతస్వినేస్వాహా" ఈమున్నగు 'ఆమనహోమములు'. 'ఆమనదేవా ఇతి తిస్ర ఆహుతీర్జుహోతి' అను వాక్యముచే విధింపఁబడుచున్నది. 95. భావ్యము = సాధ్యము.

96. ఉపాకరణము = 'ప్రజాపతేర్జాయమానాః,' 'ఇదంపశుమ్' అను నీ రెండుఋక్కులచేఁ బశువును స్పృశించుట.

ము, [97] పర్యగ్నికరణము, [98] నియోజనము ఈమున్నగు పశుధర్మములు (=పశువునకుఁ జేయుసంస్కారములు) 'అనుష్ఠానమందుసమీపము ననుండుట' యను ప్రమాణముచే 'అగ్నీషోమీయ' యాగసన్నిధి నాచరింపఁబడుటం జేసి యాయాగమునకే యంగములగుచున్నవి. [99] ఔపవసథ్యమనుదినమున [100] 'అగ్నీషోమీయ' మనుపశువు వినియోగింపఁబడును. ఆదినముననే పైనుదాహరింపఁబడినపశుధర్మములు పఠింపఁబడుచున్నవి. కావుననీధర్మములవిషయమై 'ఇవి దేనికొఱకు' లేదా 'వీనికిభావ్యమేది' అను నాకాంక్షకలుగఁగా, నుత్తరక్షణముననే వినియోగింపఁబడఁబోవునదిగా స్మరింపబడు పశువునుండి జనించు నపూర్వమే భావ్యముగా సంబంధించును. అట్టిస్థానము సమాఖ్యకంటె బలవత్తరమైనది. కావుననే "శుంధధ్వం దైవ్యాయకర్మణే" ఈమున్నగు కుంభినిశోధించు మంత్రము 'పాఠమందు సన్నిధినుండుట' యను ప్రమాణముచే, [101] సాన్నాయ్యయాగములకు సంబంధించునవియు, [102] 'కుంభి, [103] శాఖ,' మున్నగునవియు నగు పాత్రల సన్నిధిని బఠింపఁబడుటవలన, నాపాత్రలకంగమగుచున్నది. కాని [104] 'పౌరోడాశికము' అను 'సమాఖ్య'

97 దర్భనుగాల్చి పశువుచుట్టును ముమ్మారుత్రిప్పుట.

98. నియోజనము = పశువునుద్రాటిచే యూపమునకుఁ గట్టుట.

99. ఔపవసథ్యము = జ్యోతిష్టోమమందు సోమరసముసు సిద్ధపఱచు దినమునకుఁ బూర్వపుదినము. 100. జ్యోతిష్టోమయాగమం 'దగ్నీషోమీయము, సవనీయము, అనూబంధ్యము' అను మూఁడు పశువులు వినియోగింపఁబడును.

101. సాన్నాయ్యయాగములు = సాన్నాయ్యమనఁగాఁ 'పెరుగు, పాలు' ఈరెండును ద్రవ్యములుగాఁగలవియు, నింద్రుఁడు దేవతగాఁగలవియునగు యాగములు రెండింటికిని సాన్నాయ్యయాగములని పేరు.

102. కుంభి = యాగమునిమిత్తము పాలనుగాచుకుండ. 1 3. శాఖ = మోదుగుకొమ్మ. గోవులనుండి వత్సలను వేఱుచేయుటకును గోవులను బాలముతోలుటకును వినియోగించునది. 104. పౌరోడాశికము = పురోడాశమున కుపయోగించునది యను నర్థము తెలియజేయు పేరు.



ప్రమాణముచే [105] 'ఉలూఖలము' (ఱోలు) మున్నగు పురోడాశమునకు సంబంధించు పాత్రముల కంగమగునని చెప్పుటకువీలులేదు.

సమాఖ్యయను ప్రమాణము.

సమాఖ్యయనఁగా [106] యౌగికమగు శబ్దము. (=తనయందలియవయవములనుండి తెలియవచ్చునర్థమునందుఁ బ్రవర్తించుశబ్దము). అది [107] వైదికసమాఖ్య, [108] లౌకికసమాఖ్యయని రెండువిధములు గలిగియున్నది. ఒకపాత్రమునకు హౌత్రచమసము (= హోతకుసంబంధించు చమసము) అను వైదికసమాఖ్య యుండుటవలన, హోతయను ఋత్విక్కు, హోమముచేయఁగా చమసయందుమిఁగిలిన పురోడాశమును భక్షించుటయను క్రియకుఁగర్తయగుటమూలముగా నంగమగుచున్నాఁడు. యాగమునకు సంబంధించు కొన్నిక్రియలకు 'ఆధ్వర్యవములు' (=అధ్వర్యునకు సంబంధించునవి) అను లౌకికసమాఖ్యయుండుటం జేసి, యధ్వర్యుఁడాయాక్రియలకుఁ గర్తయగుటమూలముగా నంగమగుచున్నాఁడు. ('అట్టిక్రియల నాచరించుచున్నాఁడు' అనియర్థము.) ఇట్లు శ్రుతిమున్నగు నాఱుప్రమాణములను సంగ్రహముగా నిరూపింపఁబడినవి.

వినియోగవిధిచే వినియోగింపఁబడు నంగములు.

ఈప్రమాణముల సహకారముగలదియు, సర్గకాముఁడు 'సమిద్యాగము' మున్నగు నంగములవలన జనింపఁజేయఁబడు నుపకారము

105. ఉలూఖలము = పురోడాశమునిమిత్తము ధాన్యమును బియ్యముగాదంపుట కుపయోగించు ఱోలు. 106. యౌగికములు = శబ్దములు యౌగికములు, రూఢములు, యోగరూఢములు, యౌగికరూఢములునని నాలుగువిధములుగానున్నవి. యౌగికములు = పాచకుఁడుమున్నగునవి. రూఢములు = గోవు మొ॥ యోగరూఢములు = పంకజము మున్నగునవి. యౌగికరూఢము = మండపము, ఉద్భిత్తు. 1 7. వైదికసమాఖ్య = వేదోక్తకర్మములందు వాడఁబడు పేరు. 108. లౌకికసమాఖ్య = లోకమున వాడఁబడు పేరు

ను బొందినదర్శపూర్ణమాసేష్టుల నాచరించుటచే నిష్టమునుత్పాదించునది' అను నాకారముగలదియునగు వినియోగవిధిచే వినియోగింపఁజేయఁబడు నంగములు సిద్ధరూపములు క్రియారూపములునని రెండువిధములుగానున్నవి. ఇందు సిద్ధరూపములు [109] జాతి [110] ద్రవ్యము [111] సంఖ్య మున్నగునవి. ఇవి యాగస్వరూపమున కుపకరించునవిగాఁ బ్రత్యక్షప్రయోజనముగలవే యగుచున్నవి. క్రియారూపములు గూడ [112] గుణకర్మములు [113] ప్రధానకర్మములు నని రెండువిధములుగానున్నవి. ఈయుభయవిధములగు క్రియారూపములే సన్నిపత్యోపకారకములు, ఆరాదుపకారకములు, ననికూడ రెండువిధములుగానున్నవి. కర్మాంగమగు ద్రవ్యమున్నగువాని నుద్దేశించి విధింపఁబడు కర్మము [114] సన్నిపత్యోపకారకమనఁబడుచున్నది. ఉదా॥ [115] అవఘాతము, [116] ప్రోక్షణమున్నగునవి. అది దృష్టార్థము, అదృష్టార్థము, దృష్టాదృష్టార్థమునని మూఁడువిధములుగానున్నది. 'అవఘాతము' మున్నగునవి (వ్రీహులను బియ్యముగామార్చుట మొదలగు) [117] దృష్టప్రయోజనములను జనింపఁజేయుటమూలముగా యాగస్వరూపమున

109. జాతి = గోత్వము మొ॥ 110. ద్రవ్యము = వ్రీహి మొ॥ 111. సంఖ్య = ఏకత్వము మొ॥ 112. గుణకర్మములు = కర్మాంగమగు ద్రవ్యాదులందు సంస్కారమునుజనింపఁజేయుటచే గుణభూతములగు (= అప్రధానము) క్రియావిశేషములు. ఉదా॥ అవఘాతమున్నగునవి.

113 ప్రధానకర్మములు = ప్రధానమైన ఫలాపూర్వమునకుపకరించు క్రియావిశేషములు. ఉదా॥ ప్రయాజాదులు.

114. సాక్షాత్తుగాఁగాని పరంపరగాఁగాని ఫలసాధనమైన యాగముయొక్క శరీరమగు ద్రవ్యదేవతాదుల నుత్పాదించి, దానిమూలముగా నాయాగముచే జనింపఁజేయఁబడు ఫలాపూర్వమున కుపకరించు క్రియావిశేషము.

115. అవఘాతము = అవహననము = దంచుట. 116. ప్రోక్షణము = మంత్రముతో జలమును జిలుకరించుట.

117. దృష్టప్రయోజనము = ప్రత్యక్షమగు ప్రయోజనము.



కును యాగోత్పత్త్యపూర్వమునకును హేతువగుచున్నవిగాన, దృష్టార్థములనఁబడుచున్నవి. ప్రోక్షణము మున్నుగాఁగలవి సంస్కారము మొదలయిన ప్రత్యక్షముకాని ప్రయోజనములను జనింపఁజేయుట ద్వారమున ప్రధానయాగోత్పత్త్యపూర్వమునకుపకరించునుగాన 'అదృష్టార్థము'లనఁబడుచున్నవి. [118] పశుపురోడాశయాగము మున్నయినవి దృష్టాదృష్టార్థములగుచున్నవి. అవి యజమానునిచేఁ జేయఁబడు ద్రవ్యత్యాగముమూలముగా నదృష్టప్రయోజనములను, దేవతనుద్దేశించి స్మరించుట యను దృష్టప్రయోజనమును, జనింపఁజేయుచున్నవి. ద్రవ్యాదుల నుద్దేశింపక కేవలము విధింపఁబడు కర్మము [119] 'ఆరాదుపకారకము' అనఁబడుచున్నది. ఉదా॥ ప్రయాజాదులు. ఈయారాదుపకారకము [120] పరమాపూర్వమునకే యుపకరించును సన్నిపత్యోపకారకమన్ననో ద్రవ్యదేవతలయందు సంస్కారమును జనింపజేయుటమూలమున యాగస్వరూపమునకుఁగూడ నుపయోగించును. ఇందు దృష్టాదృష్టార్థమగు సన్నిపత్యోపకారకమే [121] 'ఆశ్రయికర్మము' అనికూడఁ జెప్పఁబడుచున్నది. ఇట్లు వినియోగవిధి సంగ్రహముగా నిరూపింపఁబడినది.

## ప్ర యో గ వి ధి.

ప్రయోగము శీఘ్రముగాజరుగు పద్ధతిని బోధించువిధి ప్రయోగవిధియనఁబడుచున్నది. అది ప్రయాజాదులగు నంగములను విధించువాక్యములతో నేకాన్వయమును బొందునదియు 'దర్శపూర్ణమాసాభ్యాం స్వర్గకామో యజేత' అను నిటువంటిదియునగు ప్రధానవిధియే.

118. పశువును పురోడాశమును దేవతలకొఱకు వినియోగింపఁజేయుయాగము.

119. యజమానుని యాత్మయందొక యపూర్వమును జనింపఁజేయు కర్మములు 'ఆరాదుపకారకము' లనియును గొందఱు చెప్పుదురు.

120. పరమాపూర్వము = ప్రధానాపూర్వము = ఫలాపూర్వము,

121. ఆశ్రయికర్మము = ద్రవ్యదేవతలనెడి యాశ్రయముగలది.

అది, ఆవిధియంగములతోఁగూడిన ప్రధానయాగము ననుష్ఠింపఁజేయుచున్నదై, వీనినడుమ నాలస్యముచేయుటకుఁ బ్రమాణములేదు కావున [122] 'అవిలంబము' అను వేఱొక పేరుగల ప్రయోగమందలి శీఘ్రాచరణమును విధించుచున్నది. ఇచట 'అవిలంబమునకుఁగూడఁ బ్రమాణములేదే' యని చెప్పఁదగదు. ఇచట నంగప్రధానవిధులకు మధ్యమధ్య విలంబముండినయెడల అంగవిధులకును బ్రధానవిధులకునుగల యేకాన్వయముచేఁ దెలియఁజేయఁబడిన వాని కూడిక సిద్ధింపకపోవుటయే అవిలంబమునకుఁ బ్రమాణమగుచున్నది. రెండుక్రియలు మధ్య విలంబముతో నాచరింపఁబడునపుడు 'ఇది దీనితోఁగూడియున్నది' అని యిచటఁగూడికయున్నట్లు వ్యవహారము గలుగనేరదుగదా! అట్టి యవిలంబము (క్రియలనాచరించుటయందు) నియతమైన క్రమము (=వరుస) అనుసరింపఁబడినపుడే సిద్ధించును. అట్లుకాక నియతమగు క్రమమవలంబింపనిచో 'ఈక్రియ దీనియనంతరము చేయఁబడవలసినదా? దానియనంతరమా?' అని [123] ప్రయోగము మిగులసందిగ్ధమై భ్రష్టమయ్యెడిని. కావునఁ బ్రయోగవిధియే తనచేవిధింపఁబడు ప్రయోగముల శీఘ్రాచరణము సిద్ధించునిమిత్తమై, నియతమగు క్రమమును గూడఁ [124] బదార్థముల కావశ్యకమగు నంగముగా విధించుచున్నది. కనుకనే ప్రయోగవిధికి అంగములవిషయమై 'క్రమమునుబోధించువిధి' అనికూడ లక్షణమేర్పడుచున్నది. ఇచట 'క్రమ' మనఁగా (వరుసగాఁ జేయఁబడుటచే) విస్తరించుట. లేదా, మధ్యవ్యవధానమేమియు లేక ముందు వెనుకలుగా నాచరింపఁబడుట. ఇట్టి క్రమమును నిర్ణయించుటకు శ్రుతి, అర్థము, పాఠము, స్థానము, ముఖ్యము, ప్రవృత్తి అను నాఱు ప్రమాణములుగలవు.

122. విలంబము = అలస్యము. అవిలంబము = ఆలస్యముచేయకుండుట

123. ప్రయోగము = క్రియలనాచరించుట. 124. పదార్థములు = క్రియలు.



## శ్రుతి క్రమము.

వానిలో శ్రుతియనఁగా [125] (వృత్తిమూలముగా) క్రమమును బోధించుశబ్దము. అది కేవల క్రమమునుబోధించునదియు, క్రమముతోఁగూడిన పదార్థములను బోధించునదియునని రెండువిధములుగా నున్నది. "[126] వేదం [127] కృత్వా [128] వేదిం కరోతి" (=వేదమును జేసి వేదిని సిద్ధపఱుచునది.) అనువాక్యమందలి వేదిని సిద్ధపఱుచుటమన్నగు క్రియలు వాక్యాంతరముచేఁ బ్రాప్తించునవిగాన నీవాక్యము కృత్వా (=చేసి) అను క్త్వాంతముమూలముగా కేవల క్రమమునే బోధించునదగుచున్నది. "వషట్ కర్తుః ప్రథమభక్షః" (=వషట్ అను పదము నుచ్చరించువానికిఁ బ్రథమభక్షణము విధింపఁబడుచున్నది.) అను వాక్యమన్ననో క్రమముతోఁగూడిన పదార్థములను బోధించుచున్నది. ఏకవాక్యముగా నన్వయించుటకు భంగముకలుగునను భయము కలదుగాన మఱియొకచోట విధింపఁబడిన భక్షణము ననువదించి దానివిషయమై 'ప్రథమ' అనుశబ్దముచేఁ గ్రమమునుమాత్రము విధించుటకు వీలులేదుకదా? అట్టి యీశ్రుతి తక్కినప్రమాణములకంటె బలవత్తరమైనది. తక్కినప్రమాణములన్నియు వచనమును (శ్రుతిని) గల్పించుటమూలముగాఁ గ్రమమువిషయమై ప్రమాణములగునుగదా! కావుననే (శ్రుతి బలవత్తరమైనదిగనుకనే జ్యోతిష్టోమయాగమందు) [129] ఆశ్వినమను గ్రహము పాఠక్రమముచే మూఁడవస్థానము

125. వృత్తియనఁగ శబ్దమునందుండునదియు సంకేతితమగు నర్థమును బోధించునదియునగు సామర్థ్యము. 126. వేదము = తుడుచుటకుపయోగించు దర్భలకట్ట.

127. క్త్వాంతము. కృత్వా (=చేసి). 128. వేది = ఆహవనీయము, గార్హపత్యము, అను నగ్నులకు నడుమనుండునదియు, నాలుగంగుళములులోతుగలదియు హవిస్సునుంచుట కుపయోగింపఁబడునదియునగు ప్రదేశము

129. ఆశ్వినగ్రహము = 'అశ్వినులు' అను జంటదేవతలకొఱకు నుద్దిష్టమైన హవిస్సునుంచు పాత్రవిశేషము.

నందుఁ గ్రహింపఁబడఁదగిన దైనను, "ఆశ్వినోదశమో గృహ్యతే" (=ఆశ్వినము గ్రహము పదవదిగా గ్రహింపఁబడఁదగినది) అను శ్రుతి (వచనము) చేఁబదవస్థానమందు గ్రహింపఁబడుచున్నది.

### అర్థక్రమము.

ప్రయోజనమునుబట్టి ప్రయోగించు క్రమ మర్థక్రమమనఁబడుచున్నది. ఉదా॥ "అగ్నిహోత్రంజుహోతి" అనువాక్యముచే విధింపఁబడు నగ్నిహోత్రహోమమునకును 'యవాగూంపచతి' (=గంజి కాచునది.) అను వాక్యముచే విధింపఁబడు గంజినిగాచుటయనుదానికిని గల క్రమము. ఇచట గంజి హోమమునకు నిమిత్తమగుటం జేసి గంజిని గాచుటయనునది ప్రయోజనమునుబట్టి హోమముచేయుటకుముందే యాచరింపఁబడుచున్నది. అట్టి యీయర్థక్రమము పాఠక్రమముకంటె బలవత్తరమైనది. పాఠక్రమముననుసరించియే వీని నాచరించినయెడల (తిరువాతఁ జేయఁబడిన గంజిని కాచుటయను దానికి) ప్రయోజనభంగమును, నేదేనొక యదృష్టమును గల్పించుటయును గలుగవలసివచ్చును. హోమముచేసినపిదపఁ జేయఁబడు గంజికాచుటయనుదానికి దృష్టమైన ప్రయోజనమేమియు లేదుగదా!

### పాఠక్రమము.

పదార్థము (క్రియ)ల బోధించు వాక్యముల క్రమమునకుఁ బాఠక్రమమని పేరు. దానిని బట్టియే పదార్థముల క్రమము నిర్ణయింపఁబడును. వాక్యములేక్రమమునఁబఠింపఁబడినవో యాక్రమముననే యవి చదువఁబడినవై పదార్థములను దెలియఁజేయుచున్నవి. ఏక్రమమునఁ బదార్థములు తెలియఁజేయఁబడినవో యాక్రమముననే యవి యాచరింపఁబడును. అట్టిపాఠము మంత్రపాఠము బ్రాహ్మణపాఠమునని రెండువిధములుగానున్నది. ఆగ్నేయయాగమును అగ్నీషోమీయయాగ



మును నాచరించు క్రమము[130] మంత్రపాఠమందుండు వాని వాని యాజ్యానువాక్యామంత్రముల క్రమమువనుసరించి యేర్పడుచున్నది. అట్టి యీమంత్రపాఠము బ్రాహ్మణపాఠముకంటె బలవత్తరమైనది. అనుష్ఠానమువిషయమై బ్రాహ్మణవాక్యములకంటె "మంత్రపాఠము," ఆచరింపఁబడు 'అర్థము' (క్రియ)లను స్మరింపఁజేయుటమూలముగాఁ జాలనుపకరించునుగదా! బ్రాహ్మణవాక్యము ప్రయోగమునకుఁ బూర్వమే 'ఇదియాచరింపవలసినది' అని బోధించి నిశ్చయముగాఁ దనకృత్యమునుముగించుకొనుచున్నది. మంత్రములన్ననో, ప్రయోగకాలమునఁ బదార్థముల క్రమమును స్మరింపఁజేయుచుఁబనిగలిగియేయున్నవి. పదార్థములనాచరించు క్రమము వానిని స్మరింపఁజేయు క్రమముననుసరించియుండునగనుకను, వానిని స్మరింపఁజేయుక్రమము మంత్రపాఠమందలి క్రమముననుసరించియుండునుగనుకను, నీమంత్రపాఠ మనుష్ఠానమునకు మిక్కిలి సన్నిహితముగా నుపకరించును. ప్రయాజముల విషయమై బ్రాహ్మణపాఠమునందుండు 'సమిధోయజతి, తనూనపాతంయజతి, ఇడోయజతి, బర్హిషోయజతి, స్వాహాకారంయజతి' అను నీక్రమమునుబట్టియే వాని యాచరణము జరుగుచున్నది.

ఆలోచింపఁగా బ్రాహ్మణవాక్యములు 'అర్థము' (కర్మము)ను విధించుటచేతనే తమకృత్యమును ముగించుకొనుచున్నది. అయినను ప్రయాజాదుల నాచరించు క్రమమును స్మరింపఁజేయు మఱే వాక్యమును లేనందున నాబ్రాహ్మణవాక్యములే వీనినాచరించుక్రమమును స్మరింపఁజేయునవియని యంగీకరింపఁబడుచున్నవి.

130. బ్రాహ్మణపాఠమందు 5 వ ప్రపాఠకమం దగ్నీషోమీయయాగమును, 6 వ ప్రపాఠకమం దాగ్నేయయాగమును విధింపఁబడుచున్నవి. ఇట్లున్నను మంత్రపాఠమందు వీని యాజ్యాపురోనువాక్యా మంత్రము భిన్నక్రమముగానుండుటంబట్టి వీనిలో నాగ్నేయయాగము ముందును, అగ్నీషోమీయయాగము తరువాతను నాచరింపఁబడుచున్నవి.

## స్థానక్రమము.

స్థానమనగా [131] 'ఉపస్థితి'. దేనిస్థానమందేది యాచరింపఁబడునో, దానిముందటిపదార్థము(క్రియ)చేయబడినతోడనే యదియే మొదట జ్ఞప్తికివచ్చును. కావున దానినే మొదట నాచరించుట యుక్తము. కనుకనే సాద్యస్క్రమను వికృతియాగమందు 'అగ్నీషోమీయము' 'సవనీయము' 'అనూబంధ్యము' అను మూఁడు పశువులును సవనీయపశుస్థానమున నొకేసారి వినియోగింపఁబడవలసియుండఁగా, మొదట సవనీయపశువును, బిదప మిగిలినవి రెండును వినియోగింపఁబడుచున్నవి. వానికి ముందటిదగు [132] 'ఆశ్వినగ్రహము' నుదీసికొనినతోడనే యాస్థానమందు సవనీయపశువే యుపస్థితమగుచున్నది. అది యెట్లంటేని, 'జ్యోతిష్టోమ' మను ప్రకృతియాగమందు 'అగ్నీషోమీయము' 'సవనీయము' 'అనుబంధ్యము' నని మూఁడు పశుయాగములు కలవు. వానిలో 'అగ్నీషోమీయ' మనునది 'ఔపవసథ్యదినము' నను, 'సవనీయ' మనునది [133] సుత్యజరుగు దినమునను, [134] 'అనూబంధ్య' మనునది తుదిదినమునను జరుపఁబడును గాన, నీమూఁడుయాగములును వేఱువేఱుకాలములందుఁ జేయఁదగినది. సాద్యస్క్రమనునది యనేకవిధములగు సోమయాగములలో నొకటి. అది [135] యవ్యక్తమగుటంజేసి ప్రకృతియగు జ్యోతిష్టోమయాగమునకు వికృతియగుచున్నది. కావున నాపశుయాగములు మూఁడును

131. ఉపస్థితి = స్మరింపఁబడుట, జ్ఞప్తికివచ్చుట

132. ఆశ్వినగ్రహము = అశ్వినులకొఱకు ఉద్దేశింపఁబడిన హవిస్సును ధరించు పాత్రవిశేషము. 133. సుత్య = సోమరసమును బిండి సిద్ధపఱచుట.

134. అనూబంధ్యము = అనూబంధ్యమను పశువును వినియోగించుయాగము.

135. 'అవ్యక్తమనఁగాఁ దననిమిత్తమై ప్రత్యేకముగా విధింపఁబడిన దేవతలు లేకుండుట' అని న్యాయప్రకాశికయందుఁగలదు.



సాద్యస్క్రమందు [136] 'చోదక' వాక్యముచేఁ బ్రాప్తించుచున్నవి. ఆ సాద్యస్క్రమందు "సహపశూనాలభేత" (పశువులనొకేపర్యాయ మాలంభింపవలయును) అను వాక్యముచే నీపశువులనొకేసారి వినియోగించునదియని తెలియుచున్నది. అట్టి [137] సహానుష్ఠానము సవనీయపశువును వేయు [138] దినముననే జరుపఁబడును. సవనీయపశువు ప్రధాన (యాగ) మునకు సన్నిహితమై యుండుటచేతను, నట్లుచేసిన యెడల మిగిలిన రెండుపశువులకును వానివాని స్థానములనుండి జరుగు నతిక్రమము సమముగా నుండఁదగినదగుటచేతను, నీసహానుష్ఠానము సవనీయస్థానమునందే జరుపుట యుక్తము. సవనీయదేశమునందీ సహానుష్ఠానమును జరిపినచో 'అగ్నీషోమీయానూబంధ్య' పశువులు రెండింటికిని వానివానిస్థానమొక్కొకటిమాత్రమె యతిక్రమింపఁబడును. (ప్రధానమునకును సవనీయమునకు సామీప్యము కుదురును) ఈసహానుష్ఠానము నగ్నీషోమీయదినమున జరిపినచో సవనీయపశువునకుఁ దనస్థానముమాత్రమేయతిక్రమించును. అనుబంధ్యపశువునకన్నో, తనస్థానమతిక్రమించుటయేగాక తనకుముందుండు సవనీయపశువుయొక్క స్థానముఁగూడ నతిక్రమించుట సంభవించెడిని. ఇట్లే యీ సహానుష్ఠానమనూబంధ్యపశువును వేయుదినమందు జరపినచో సవనీయపశువునకు స్వస్థానముమాత్రమతిక్రమింపఁగా, అగ్నీషోమీయపశువునకు స్వస్థానమేకాక సవనీయస్థానముకూడ నతిక్రమించుట సంభవించెడిని యని గ్రహించునది. కాఁగా సవనీయపశువును వేయుకాలమందీసహానుష్ఠానము జరుపవలసియుండ, వీనిలో సవనీయపశువునీసమయమందు మొదటవినియోగించునది. ఆశ్వినగ్రహమును దీసికొని

136. చోదకవాక్యము = 'ప్రకృతివద్వికృతిః కర్తవ్యా' అనునతిదేశవాక్యము. ప్రకృతివలె వికృతియుఁజేయునదియని దానికర్థము.

137. సహానుష్ఠానము = సహాచరణము = ఒకపర్యాయమే చేయుట.

138. సోమరసమును సిద్ధపఱచుదినము.

నయనంతరమే సవనీయపశువును వేయు కాలము వచ్చును. 'ప్రకృతి యగు జ్యోతిష్టోమయాగమం దాశ్వినగ్రహమును గ్రహించి (తీసికొని) మూఁడుపేటలు వేసిన త్రాటిని యూపమునకుఁ జుట్టి, సవనీయపశువునకుపాకరణమను సంస్కారమును జేయునది' అను వినియోగవాక్యమువలన, ఆశ్వినగ్రహమును దీసికొనిన వెంటనే సవనీయపశువు విధింపఁబడుచున్నట్లు తెలియుచున్నదిగాన, వికృతియాగమగు సాద్యస్క్రమునందుఁగూడ నాశ్వినగ్రహమును దీసికొనిన వెంటనే సవనీయపశువుపస్థితమగుచున్నది. కావున నీకాలము సవనీయపశువునకు స్థానమగుటం జేసి, యిపుడు మొదట సవనీయపశువును, పిదప మిగిలినపశువులను రెంటిని వినియోగించునది యని (శాబరభాష్యమందలి పంచమాధ్యాయమందుఁ బ్రథమపాదమున) చెప్పఁబడినది

ముఖ్యక్రమము.

ప్రధానములను జేయుక్రమమును ననుసరించియే యంగముల నాచరించుక్రమము నిర్ణయింపఁబడుచున్నది. అట్లు నిర్ణయింపఁబడిన యంగముల క్రమము ముఖ్యక్రమమనఁబడుచున్నది. ప్రధానములను జేయు క్రమముననే యంగములనుగూడ నాచరించినచో, నంగములన్నిటికిని వానివాని ప్రధానములకును సమానమైన వ్యవధానముండును. అట్లు కాక ప్రధానములను జేయు క్రమమునను సరింపక, యంగములు వేఱుక్రమమున నాచరింపఁబడినయెడలఁ గొన్ని యంగములకు వానివాని ప్రధానములతో మిక్కిలి సామీప్యమును, మఱికొన్ని యంగములకును వానివాని ప్రధానములకును మిక్కిలి[139] వ్యవధానమును సంభవించెడిని. ప్రయోగవిధినుండి తెలియు 'ప్రధానములన్నియు వానివాని యంగములతోఁగూడి యుండవలెను.' అను[140] సాహిత్యము

139. వ్యవధానము = వ్యవధి = నడుమనుండు కాలము = అవకాశము.

140. సాహిత్యము = ప్రధానము లింగములతోఁగూడియుండుట.



నకు భంగముకలుగును గానఁ బ్రధానములక్రమముకంటె భిన్నక్రమమున నంగముల నాచరించుట యుక్తముకాదు. కావునఁ బ్రధానక్రమమాంగక్రమమును నిర్ణయించుటకు హేతువగుచున్నది. అందువలననే ఆగ్నేయయాగము, ఐంద్రయాగము, ముందు వెనుకలుగా నాచరింపఁబడును గానఁ బ్రయాజముల నాచరింపఁగా మిగిలిన నేతితో ముందు ఆగ్నేయయాగమునకు సంబంధించు పురోడాశమగు హవిస్సునకును, బిదప నైంద్రయాగమునకు సంబంధించు దధికిని, నభిఘారణము చేయవలసియున్నది. కాఁగా నొక్కొక[141] యభిఘారణమునకు దానిదానిసంబంధించు యాగమునకును మధ్యనొక క్రియమాత్రమే యుండుటఁ జేసి ప్రతియభిఘారణమునకును దానిసంబంధించుయాగమునకును సమానమగు వ్యవధియుండును. అట్లు కాక ఆగ్నేయైంద్రయాగముల క్రమము ననుసరింపక, వేఱుక్రమముగా నవలంబించి మొదట దధికిని బిదపఁ బురోడాశమునకును నభిఘారణము చేసినయెడల, ఆగ్నేయహవిస్సునకుఁ జేయు నభిఘారణమునకును ఆగ్నేయయాగమునకును వ్యవధానమేమియు లేకపోవుటయును, ఐంద్రహవిస్సగు దధికిఁ జేయు నభిఘారణమునకును నైంద్రయాగమునకును రెండుక్రియలు నడుమ నుండుటచే నెక్కువవ్యవధానమును దప్పక సంభవించెడిని. అట్లు సంభవించుట యుక్తముకాదు. (అని శాబరభాష్యమునఁ బంచమాధ్యాయమందు వివరింపఁబడినది) అట్టి ముఖ్యక్రమము పాఠక్రమముకంటె బలహీనమైనది. ముఖ్యక్రమము[142] (విధిపాఠమను) ప్రమా

141. అభిఘారణము = కొంచెము నేతి నుంచుట మూలముగాఁ బదార్థములను సంస్కరించుట.

142. కొన్నిచోట్ల బ్రాహ్మణవాక్యముల పాఠమును గొన్నిచోట్ల యాజ్యానువాక్యామంత్రముల పాఠమును బ్రధానక్రమమును నిర్ణయించుటకై ప్రమాణాంతరములుగా నపేక్షింపఁబడుచున్నవి.

ణాంతరము నపేక్షించిన ప్రధానక్రమము తెలిసినపిదపనే నిర్ణయింపబడుటం జేసి, యాలస్యముగాఁ దెలియఁబడుచున్నది. పాఠక్రమమన్ననో, ప్రమాణాంతరము నపేక్షింపక, స్వతంత్రమగు స్వాధ్యాయమునందలి పాఠక్రమమును మాత్రమే యపేక్షించునదగుటచే, నాక్రమమును దెలిసికొనుటకాలస్యముండదు. కావునఁ బాఠక్రమము ముఖ్యక్రమముకంటె బలవత్తరమగుచున్నది. ఈముఖ్యక్రమము ప్రవృత్తిక్రమముకంటె బలవత్తరమైనది. ప్రవృత్తిక్రమము నవలంబించునపుడనేకపదార్థములు చేయఁబడవలసియుండఁగా, మొదటిపదార్థము నాచరించిన క్రమమునపేక్షించియే రెండవదిమున్నగు పదార్థముల నాచరించుక్రమము నిర్ణయింపఁబడుచున్నది. అట్లు చేసినయెడల ననేకములగు నంగములకును వానివానిప్రధానములకును నెక్కువవ్యవధానముండునుగదా! ముఖ్యక్రమమవలంబించినచో నంగములన్నియు వానివాని ప్రధానములకు సన్నిహితములుగా నేయుండునుగదా!

### ప్రవృత్తిక్రమము.

అనేకప్రధానములొకేసారి ప్రయోగింపఁబడవలసియుండునపుడు వీనికావశ్యకములగు నంగములలో నొక్కొకటి[143] యావృత్తిచే నాచరింపఁబడవలసియుండఁగా, మొదట నాచరించిన[144] పదార్థము యొక్క క్రమమునుబట్టి రెండవది మున్నగు పదార్థముల నాచరించు క్రమమేర్పడుచున్నది. ఇట్లేర్పడిన క్రమమునకుఁ బ్రవృత్తిక్రమమని పేరు. ఉదా॥ ప్రజాపతి దేవతకొఱకుద్దిష్టములగు పశువులకుఁ జేయు సంస్కారములనెడి యంగముల నాచరించు క్రమము. "వైశ్వదేవీం కృత్వా ప్రాజాపత్యైశ్చరంతి" (=వైశ్వదేవము నాచరించి ప్రాజాపత్య

143. ఆవృత్తి=ఒక్కొకయంగమే ప్రధానములన్నిటినిమిత్తమును నాచరింపబడుట. 144. పదార్థములు=అంగములగు క్రియలు.



పశువులను వినియోగించుటచే నిష్టము నుత్పాదించునది.) అను వాక్యమునందలి 'ప్రాజాపత్యైః' అను తృతీయాంతముచే 'ప్రాజాపత్యపశువు' లితికర్తవ్యతతోఁ గూడినవై యొకేకాలమున వినియోగింపఁబడవలసినవిగా విధింపఁబడుచున్నవి. కావున నాపశువులన్నిటికిని దమయంగములగు నుపాకరణము, నియోజనము, మున్నగువానితో సహానుష్ఠానము సంపాదింపవలయును. అట్టి సహానుష్ఠానము ప్రాజాపత్యపశువులన్నియు నాదేవతకొఱకుద్దిష్టములగునట్లొకే పర్యాయము వినియోగింపఁబడునప్పుడే కుదురుచున్నది. వానియంగములగు నుపాకరణాదులన్నియు నొకేసారి యాచరించుట యశక్యము. కనుక నుపాకరణాదులగు నంగముల సహానుష్ఠానము, వానివాని నడుమ విశేషవ్యవధానము లేకుండ నాచరించుటచే సంపాదింపఁదగియున్నది. కనుక మొదట నేదేనొక పశువునకుపాకరణము చేసి పిదప వరుసగా రెండవది మూఁడవది మున్నగు పశువులన్నిటికి నుపాకరణమే చేయవలెను. ఈవరుసగానే నియోజనము మున్నగు సంస్కారములన్నియు నాచరింపవలయును. కాఁగా, ప్రాజాపత్యపశువులలో నేదేనొక పశువునుండి యారంభించి, యొకసంస్కారము నేదేనొకక్రమమున నన్నిటికి నాచరించి, రెండవది మున్నగు సంస్కారములన్నిటిలో నొక్కొకటియు నదేక్రమమునఁ బశువులన్నిటికిని జేయవలెను. మొదటిసంస్కారము నాచరించుట యనుప్రవృత్తి ననుసరించి రెండవది మున్నగు సంస్కారముల క్రమమేర్పడుచున్నది గనుక, నిట్లేర్పడిన క్రమము ప్రవృత్తిక్రమమనఁబడుచున్నది. ఈప్రవృత్తిక్రమము శ్రుతిమొదలగు క్రమములకంటె బలహీనమైనది. ఇట్లు ఆఱువిధములగు క్రమముల నిరూపించుటమూలముగాఁ బ్రయోగవిధి సంగ్రహముగా వివరింపఁబడినది.

## [145] అధికారవిధి.

'కర్మజన్యఫలస్వామ్యము'ను బోధించువిధి యధికారవిధి. అనగా, 'కర్మములనుండి జనించు ఫలముననుభవింపఁదగియుండుటను' దెలియఁజేయువిధియని యర్థము. అవి "యజేత స్వర్గకామః" (=స్వర్గమునుగోరువాఁడు యాగమునాచరించుటచేనిష్టమును త్పాదింపవలయును) అనునీరీతిగానుండువిధి. స్వర్గమునుద్దేశించి యాగమును విధించు నీవిధివాక్యముచే, 'స్వర్గమునుగోరువానికి యాగమువలన జనించుఫలానుభవముండును' అని తెలియఁజేయఁబడుచున్నది కర్మమును గర్తవ్యముగావిధించు "యస్యాహితాగ్నేరగ్నిర్గృహాన్ దహేత్ సోఽగ్నయే క్షామవతే పురోడాశమష్టాకపాలం నిర్వపేత్" (=[146] ఏఆహితాగ్నియొక్క గృహముల నగ్ని దహించునో, యతఁడు కృశించినయగ్నికొఱకు నెనిమిది కపాలములయందు సంస్కరింపఁబడిన పురోడాశమును నిర్వపించుటచే నిష్టమును త్పాదింపవలయును.) ఈమున్నగువిధిచే 'నట్టి నిమిత్తము తటస్థించిన' వాఁడాకర్మమునుండి జనించు పాపక్షయమును ఫలమును బొందునని తెలియఁజేయఁబడుచున్నది. ఇట్లే 'అహరహస్సంధ్యాముపాసీత' (దినదినమును సంధ్యావందనముఁజేయుటచే నిష్టమును త్పాదించునది.) అనువిధిచే శుచియై విహితమగుకాలమువఱకు జీవించు మనుజుఁడు సంధ్యావందనముచే జనించు [147] ప్రత్యవాయపరిహారమును ఫలముననుభవించును.' అని బోధింపఁబడుచున్నది. ఎవఁ

145, అధికారము = కర్మమువలన జనించుఫలము ననుభవింపగోరుట. ఇట్టి యధికారమును దెలియఁజేయు విధి 'యధికారవిధి' యని చెప్పఁబడుచున్నది.

146. ఆహవనీయము, దక్షిణాగ్ని, గార్హపత్యము, అను త్రేతాగ్నుల (మూడగ్నుల) నుంచుటచే సంస్కరింపఁబడినవాఁడు.

147 ప్రత్యవాయపరిహారము = ఆపత్తులను నివారించుట.



డధికారము (యోగ్యత) గలిగియుండునో వానికే యాఫలానుభవముగలుగును. విధివాక్యములందుఁ బురుషునకేది విశేషణముగా వినఁబడుచున్నదో యదే యధికారము. ఉదా॥ [148] కామ్యకర్మమునందా కర్మమువలన జనించుఫలమును గోరుట యధికారము. [149] నైమిత్తికమగు కర్మమునందు అట్టి [150] నిమిత్తము సంభవించినట్లు నిశ్చితముగాఁ దెలిసికొనుట యధికారము. [151] నిత్యకర్మమగు సంధ్యోపాసనమునందు శుచియై (సదాచారముగలవాఁడై) యుండి విహిత (ఈశ్వరునిచే నిర్ణయింపఁబడిన) కాలమువఱకు జీవించియుండుట యధికారము విధియందుఁ బురుషునికి విశేషణముగా వినఁబడునదియే యధికారముగనుక 'రాజా రాజసూయేన స్వారాజ్యకామో యజేత' (=[152] స్వారాజ్యమునుగోరు రాజు [153] రాజసూయయాగముచే నిష్టమును త్పాదింపవలయును.) అను విధివాక్యము స్వారాజ్యమను ఫలమునుద్దేశించి యొకయాగవిశేషమును విధించుచున్నదయినను, దీనిచే స్వారాజ్యమును గోరువానికిమాత్రమే యాఫలప్రాప్తి కలదని బోధింపఁబడుచుండుటలేదు. మఱేమన, [154] రాజై యుండి

148 కామ్యకర్మము = ఏదేనొకఫలమునుగోరి చేయుకర్మము.

149. నైమిత్తికకర్మము = ఏదేనొకప్రత్యేకమగు కారణముకలిగినపుడుచేయు కర్మము 150. నిమిత్తము = కారణము = ఆవశ్యకత.

151. నిత్యము = ఏవిధమగుఫలమును గోరక బ్రతికియున్నంతకాలమునుఁ బ్రతిదినమును దప్పక యాచరించు కర్మము.

152. స్వారాజ్యము = (స్వర్ + రాజ్యము) = స్వర్గరాజ్యము (స్వర్ = స్వర్గము) ఉ॥ నిర్ + రసము అనుచోట 'నీరసము' అని యైనట్లు.

153. రాజసూయము = రాజా లతాత్మకః సోమః సూయతే అస్మిన్ = ఈ యాగమునందు సోమలత పిండఁబడును గనుక దీనికి 'రాజసూయము' ను పేరు గలిగెను.

154. క్షత్రియుఁడై యుండి ప్రభువైనను నితరజాతివానికి యధికారము లేదు.

స్వారాజ్యమునుగోరువానికే యట్టిఫలప్రాప్తి కలుగునని తెలియఁజేయఁబడుచున్నది. ఈవిధివాక్యమందు 'రాజైయుండుట' కూడ నధికారికి విశేషణమగునట్లు వినఁబడుచున్నదిగదా! కొన్నిచోట్లఁ బురుషునకు విశేషణముగా వినఁబడనిదైనను నధికారికి విశేషణము కాఁగలదు. ఉ॥ (i) 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' అనువిధిచే సిద్ధించునర్థజ్ఞానము:- జ్యోతిష్టోమాది క్రతువులను విధించు విధులప్రవృత్తికర్థజ్ఞాన మావశ్యకము గనుక నీవిధులయందర్థజ్ఞానము పురుషునికి విశేషణముగా వినఁబడకపోయినను, నివి యధ్యయనవిధిచే సిద్ధించు నర్థజ్ఞానముగల పురుషునిగూర్చియే ప్రవర్తించుచున్నవిగదా! (ii) ఇట్లే [155] యగ్నులచే నెఱవేర్పఁబడు కర్మములందు [156] 'ఆధానము' చేసిద్ధించిన యగ్నులను గలిగియుండుటయే యధికారమగుచున్నది. అగ్నులచే [157] సాధింపఁబడు కర్మముల కగ్నులవసరము గనుక నట్టికర్మములను బోధించు విధులాధానముచే సిద్ధించిన యగ్నులుగలవానిని గూర్చియే ప్రవర్తించునుగదా! (iii) ఇటులనే [158] సామర్థ్యముగూడఁ బురుషునికి విశేషణముగా వినఁబడకున్నను నధికారివిశేషణమగుచున్నది. "అర్థమునుదెలియఁజేయు నాఖ్యాతము (క్రియ) లకు వానియందలి శక్తి సాహాయ్యముచేయును." అను న్యాయమువలన నీవిధులు సమర్థుఁడగు మనుష్యునిగూర్చియే ప్రవర్తించుచున్నవిగదా! ఇట్లు విధి సమగ్రముగా నిరూపింపఁబడినది.

155. అగ్నులు = దక్షిణాగ్ని, గార్హపత్యము, ఆహవనీయము అను త్రేతాగ్నులు.

156. ఆధానము = మంత్రసంస్కారముతోఁ ద్రేతాగ్నుల నుత్పాదించు కర్మము. దీనికి 'అగ్న్యాధానము' అని నామాంతరము కలదు.

157. సాధింపఁబడు = నెఱవేర్పఁబడు.

158. సామర్థ్యము = అవయవపటుత్వము-దేహదార్ఢ్యము.



## మంత్రములు.

ప్రయోగములయందలి క్రియలను, వానిని సంబంధించు విషయములను, స్మరింపఁజేయువాక్యములకు మంత్రములని పేరు. అవియట్టివిషయములను స్మరింపఁజేయుటమూలముగానే ప్రయోజనముగలవగుచున్నవి. కాని వాని యుచ్చారణ మదృష్టముకొఱకుఁ గానేరదు. దృష్టమగుఫలము సంభవించునెడ నదృష్టమును గల్పించుట న్యాయము కాదుగదా! "ప్రయోగమునందలి యర్థములను స్మరించుట యను దృష్టప్రయోజనము 'పురోహితుల యుపదేశవాక్యములు, ప్రయోగములు, తిఱచుచూచుట' మున్నగు నితరకారణములవలన సిద్ధింపఁదగియుండఁగా, నట్టి ప్రయోజనముకొఱకే మంత్రములనుచ్చరించుట వ్యర్థమయ్యెడిని" అని శంకింపరాదు 'మంత్రములనుచ్చరించుటమూలముననే వానియందుండు నర్థమును స్మరింపవలెను' అను నియమవిధి యంగీకరింపఁబడుచున్నదిగదా!

## నియమవిధి.

అనేకసాధనములచే సాధింపఁదగిన క్రియవిషయమై యొకసాధనము ప్రవర్తించునపుడు మఱియొకసాధనము ప్రవర్తింపనేరక యుండ, నట్టి ప్రవర్తింపఁజాలని సాధనమును దప్పక ప్రవర్తింపఁజేయు విధి నియమవిధి యగుచున్నది. ఇందునుగూర్చి :—

"విధిరత్యంతమప్రాప్తౌ నియమః పాక్షికే సతి ।
తత్ర చాన్యత్ర చ ప్రాప్తౌ పరిసంఖ్యేతి గీయతే॥"

అని మీమాంసకులు చెప్పుదురు. దీనియర్థమీక్రింద వివరింపఁబడును. ప్రమాణాంతరముచేఁ దెలియఁబడని 'ఈకర్మమీఫలమును జనింపఁజేయును' అనుదానిని దెలియఁజేయువిధి 'అపూర్వవిధి' యగు

చున్నది. ఉదా॥ 'యజేత స్వర్గకామః' (=స్వర్గమును గోరువాఁడు యాగమునాచరించుటచే నిష్టమునుత్పాదింపవలెను.) ఈరీతిగా నుండునవి. ప్రమాణాంతరముచేఁ దెలియఁబడని 'ఈయాగము స్వర్గమునుత్పాదించును' అను విషయము ప్రమాణాంతరముచేఁ బ్రాప్తింపక ఈవిధివాక్యముందే విధింపఁబడుచున్నదిగాన నీవిధి యపూర్వవిధియగుచున్నది. రెండుసాధనములచే సాధింపఁదగిన ప్రయోజనము సిద్ధింపఁజేయుటకై వానిలో నొకసాధనము ప్రవర్తించుపక్షమున రెండవసాధనము ప్రవర్తింపఁజాలనిదై యుండఁగా, నట్టిసాధనమునే తప్పక విధింపఁజేయు విధి నియమవిధియగుచున్నది. ఉదా॥ 'వ్రీహీనవహన్తి' (=వ్రీహులను దంపవలయును) ఈరీతిగానుండు విధి. ఈవిధి యొకపక్షమందుఁ బ్రాప్తింపఁజాలనిదాని నెట్లు విధించుచున్నది యను ప్రశ్నమునకీక్రిందిది సమాధానము. [159] అవఘాతముచేత 'పొట్టు' తొలఁగించుట యనునది లోకమంద [160] న్వయవ్యతిరేకముచే సిద్ధింపఁగలదు గాననీవిధిచే నిట్టి లోకప్రసిద్ధమగు విషయము తెలియఁజేయఁబడుటలేదు. మఱేమన, నొకపక్షమునందుఁ బ్రాప్తింపఁజాలని యంశమును బూరించుట యను నియమము తెలియఁజేయఁబడుచున్నది. పొట్టును దొలఁగించుట యనేకములగు నుపాయములచే సాధింపఁదగియుండుటంజేసి 'అవఘాతము' నుమాని మఱియొక యుపాయము నవలంబించునపుడు 'అవఘాతము' ప్రాప్తింపఁజాలదుగనుక నాయవఘాతమును విధించుట యను 'ప్రాప్తింపఁజాలని యంశములను బూరించుట' యే యీవిధిచేఁ

159. అవఘాతము = అవహననము = దంచుట.

160. ఒకటియున్నచో రెండవది యుండుట అన్వయము. అదిలేనిచో రెండవదియుండకుండుట వ్యతిరేకము. ఈరెంటిరూపమగు సంబంధమునకే అన్వయవ్యతిరేకమని పేరు. ఉదా॥ మృత్తుండినచో ఘటముండును. మృత్తుండనిచో ఘటమునుండదు. ఇట్టిసంబంధము కార్యకారణములకెప్పుడును నుండును.



జేయఁబడుచున్నది. కావున నొకపక్షమందుఁ బ్రాప్తింపఁజాలని యంశమును బూరించుటయను నియమమే, యీనియమవిధికర్థమగుచున్నది. గోళ్ళతోనొలుచుట మొదలగు నితరసాధనములు ప్రాప్తించుపక్షమునందుఁ బ్రాప్తింపఁజాలని యవఘాతమీవిధియందు విధింపఁబడుచున్నదిగదా! కాని యపూర్వవిధియందువలె నేవిధముగాను దెలియంబడని విషయమిచ్చటఁ గర్తవ్యముగాఁ దెలియంజేయఁబడుటలేదు.

## పరిసంఖ్యావిధి.

ఒకప్రయోజనమును సాధించుటకు రెండుసాధనములు నొకేసారి ప్రవర్తింపఁదగియుండఁగా, వానిలో ననిష్టమగు సాధనమును నివర్తింపఁజేయు (ప్రవర్తింపకుండఁజేయు) విధికి 'పరిసంఖ్యావిధి' యని పేరు. ఉదా॥ "పంచపంచ నఖా భక్ష్యాః" (=ఐదుగోళ్లుగల జంతువులలో నైదుజాతులుమాత్రమే భక్షింపఁదగినవి.) అను రీతివాక్యము. ఈవాక్యముచే నైదుగోళ్లుగల జంతువులను భక్షించుటవిధింపఁబడుటలేదు. లోకమునందట్టి భక్షణము ఇష్టమున్నవారిచేఁ జేయఁబడునుగదా! ఇది నియమమును దెలియఁజేయునదియునుగాదు. ఐదుగోళ్ళుగల జంతువులను భక్షించుటయు నితరజంతువులను భక్షించుటయు నొకేసారి ప్రాప్తింపవచ్చును గాన నిచట 'ఒకపక్షమందుమాత్రమే ప్రాప్తించుట' యనునదిలేదు. కావున నిది [161] 'పంచనఖములుగల జంతువులలోఁ బైనుదాహరింపఁబడిన యైదుజాతులుదక్కఁ దక్కినజాతుల భక్షణమును' నివర్తింపఁజేయునదగుటంజేసి, పరిసంఖ్యావిధి యగుచున్నది. ఇది 'శ్రౌతియగు పరిసంఖ్య' 'లాక్షణికియగు పరిసంఖ్య' అని రెండువిధములుగానున్నది. ఇచట (పవమానబుక్కులచేతనే గానముచేయునది.) అనునది శ్రౌతియగు పరిసంఖ్య. ఈవాక్య

161. పంచనఖములు = అయిదుగోళ్లు.

మునందు నిశ్చయమును దెలియఁజేయు 'ఏ' అను శబ్దముచే 'పవమాన ఋక్కులకంటె వేఱుఋక్కులతో స్తోత్రముచేయుట నివర్తింపఁజేయఁబడుచున్నదిగదా! [162] "పంచపంచ నఖా భక్ష్యాః" అనువాక్యమన్ననో 'లాక్షణికియగు పరిసంఖ్య' యగుచున్నది ఇందనిష్టమగు నితరమైనదానిని నివర్తింపఁజేయుటను సూచించుపద మేమియు లేదు గదా! కావుననే యీ 'లాక్షణికి పరిసంఖ్య' మూఁడుదోషములుగలిగియున్నది. అవి (i) శ్రుతహాని (ii) అశ్రుతకల్పన (iii) ప్రాప్తబాధము, అనునవి. "పరిసంఖ్యయందు (1) వినఁబడునర్థమునుబరిత్యజించుట (2) వినఁబడనిదానిని గల్పించుట (3) ప్రాప్తించినదానికి నివృత్తి, అను నీమూఁడును సంభవించును గాన నీవిధి మూఁడుదోషములుగలదియగుచున్నది." అని మీమాంసకులు చెప్పుదురు. ఇచట (i) వినఁబడునట్టి 'పంచనఖములుగల జంతువుల భక్షణము' విడువఁబడుచున్నది. (ii) వినఁబడని పంచనఖములులేని జంతువులను భక్షింపకుండుట కల్పింపఁబడుచున్నది. (iii) [163] రాగముచేఁ బ్రాప్తించిన 'పంచనఖములులేని జంతువుల భక్షణము' నివర్తింపఁజేయఁబడుచున్నది. ఈ మూఁడుదోషములలో మొదటి రెండుదోషములును శబ్దము నాశ్రయించియుండి శబ్దమూలముగానే తెలియఁజేయఁబడుచున్నవి. మూఁడవదగు ప్రాప్తబాధమన్ననో యర్థమూలముగానే తెలియఁజేయఁబడును. ఇట్లే యితరపరిసంఖ్యావిధులయందుఁగూడ నీదోషములను గ్రహించునది. కాఁగాఁ నాచరింపఁబడు 'క్రియలు మంత్రములనుచ్చ

162. పంచనఖములుగల జంతువులలో 1 కుందేలు, 2 ఏదుపంది, 3 ఉడుము 4 ఖడ్గమృగము 5 తాఁబేలు అను నైదుజాతులుమాత్రమే తినఁదగినవి– ఇవి రామాయణమునందు శ్రీరామునిగూర్చి వాలిచేఁ జెప్పఁబడిన "బ్రహ్మక్షత్రేణ రాఘవ। శల్యకశ్శ్వావిధోగోధాశ్శశః కూర్మశ్చ పంచమః" అను వాక్యమునందుఁగలదు.

163. రాగము = అభిలాష.





రించుటమూలముగానే స్మరింపఁబడవలసినవి' అను నియమవిధి యంగీకరింపఁబడుటంజేసి మంత్రముల నుచ్చరించుట వ్యర్థముకానేరదని సిద్ధించుచున్నది. కావున మంత్రములు ప్రయోగమునందలి క్రియలను స్మరింపఁజేయుటమూలమున సార్థకములగుట యుక్తముగానున్నది. ఏమంత్రములు ప్రయోగమందలి యర్థమును స్మరింపఁజేయనేరవో యట్టి 'హుం, ఫట్' ఇత్యాది మంత్రములన్ననో, వానినుచ్చరించుటచే దృష్టమగు ప్రయోజనమేమియుఁ గలుగకుండుటంజేసి, యదృష్టమగు ప్రయోజనము కల్పింపఁబడుచున్నది. కావున నట్టి మంత్రములప్రమాణములు కానేరవు.

### [164] నామధేయవిచారము.

నామధేయములుకూడ విధింపఁబడు కర్మములను నిర్ణయించుటమూలముగాఁ బ్రమాణములగుచున్నవి. అవి యెట్లంటేని, "ఉద్భిదా యజేత పశుకామః" (=పశువులనుగోరువాఁడు 'ఉద్భిత్తు' అనుయాగముచే నిష్టమునుత్పాదించునది.) అనువాక్యమందు 'ఉద్భిత్తు' అను శబ్దమిందు విధింపఁబడు యాగమునకు నామధేయమగుచున్నది. ఈ శబ్దముచే విధింపఁబడు యాగమిట్టిదియని తెలియఁజేయఁబడుచున్నది. ఈయుద్భిచ్ఛబ్దము నామధేయమెట్లగుచున్నదో యారీతి యీక్రింద వివరింపఁబడుచున్నది. ఈవాక్యమందుఁ బ్రమాణాంతరముచేఁ బ్రాప్తింపని యాగమొకటి పశువను ఫలమునుద్దేశించి విధింపఁబడుచున్నది. ఇచట నేదేనొక యాగసామాన్యము విధింపఁబడినచోఁ బ్రయోజనము లేదుగనుక, యాగవిశేషమే విధింపఁబడుచున్నది. అట్టి యాగవిశేషమేది? యని యాకాంక్ష కలుగఁగా, నిందలి 'ఉద్భిత్' అను శబ్దమువలన నీయాగవిశేషము 'ఉద్భి' త్తను యాగమని తెలియుచున్నది.

164. నామధేయము = పేరు.

ఈవిధికి 'ఉద్భిత్తను యాగముచేఁ బశువు నుత్పాదించునది' అనునది యర్థమగుచుండగా ఉద్భిత్తను పదము యాగపదముతో [165] సామానాధికరణ్యము కలిగియుండుటంజేసి యా యాగమునకు నామధేయముగా నన్వయించుచున్నదిగదా! (i) మత్వర్థలక్షణావలని భయము (ii) వాక్యభేదమువలని భయము, (iii) తత్ప్రఖ్యశాస్త్రము, (iv) తద్వ్యపదేశము, అను నాలుగు ప్రమాణములవలన విధివాక్యములందుండు నాయాపదములు యాగనామధేయములని నిర్ణయింపఁబడుచున్నవి ఉదా. (i) "ఉద్భిదా యజేత పశుకామః" అను వాక్యమందలి 'ఉద్భిత్' అను శబ్దము [166] మత్వర్థలక్షణావలని భయముచే నిచట విధింపఁబడు యాగమునకు నామమగుచున్నది. అది యెట్లనేని:- ఈవిధిచే, బశువను ఫలము నుద్దేశించి యాగము విధింపఁబడుచున్నదనియు, యాగము నుద్దేశించి ఉద్భిత్తను గుణము విధింపఁబడుచున్నదనియును జెప్పుటకు వీలులేదు. అట్లు చెప్పినచో [167] వాక్యభేదము సంభవించెడినిగదా! మఱియు 'ఉద్భిత్' శబ్దము యాగమున కావశ్యకమగు గుణమును బోధించు నెడల, యాగముకూడఁ బ్రమాణాంతరముచేఁ బ్రాప్తింపనిదగుటంజేసి యీ వాక్యముచే గుణముతోఁగూడిన కర్మము విధింపఁబడుచున్నదని చెప్పవలసివచ్చును. 'ఉద్భిత్తుతోఁగూడిన యాగముచేఁ బశువు నుత్పాదించునది' అని [168] గుణవిశిష్టమగు

165. సామానాధికరణ్యము = సమానమగు విభక్తిని గలిగియుండుట. అనఁగా విశేషణమగుట.

166. మత్వర్థలక్షణ = 'అదికలది' అను నర్థమును దెలియఁజేయు లక్షణ యను సామర్థ్యమును గల్పించుటవలని క్లేశము.

167. 'పశుకాముఁడు యాగముచే నిష్టము నుత్పాదించునది' 'అతఁడు ఉద్భిత్తను వస్తువుచే యాగము నుత్పాదింపవలయును' అను రెండు వాక్యములుగా నన్వయించుట.

168. గుణవిశిష్టము = గుణముతోఁగూడినది.



కర్మమును విధించినచో, 'ఉద్భిత్' అను శబ్దమునకు 'ఉద్భిత్తుతోఁగూడిన' అను నర్థము చెప్పుటకు [169] 'మత్వర్థలక్షణ' అంగీకరింపవలసివచ్చునని యింతకుముందే చెప్పఁబడినదిగదా!

'చిత్రయా యజేత పశుకామః' (=పశువును గోరువాఁడు 'చిత్ర' అను పేరుగల యాగముచే నిష్టము నుత్పాదించునది.) అను వాక్యమందు వాక్యభేదమువలని భయముచే 'చిత్రా' అను శబ్ద మిచట విధింపఁబడిన యాగమునకు నామధేయమగుచున్నది. అది యెట్లనేని:- ఇచట గుణవిశిష్టమగు యాగమును విధించుట సంభవింపనేరదు. "దధి మధు ఘృత మాపో ధానాస్తండులాః తత్సంసృష్టం ప్రాజాపత్యమ్" (=పెరుగు, తేనె, నేయి, జలము, వేఁపుడుబియ్యము, బియ్యము, అను నీయాఱువస్తువుల కూడికయే ద్రవ్యముగాఁ గలది [170] ప్రాజాపత్యమను కర్మము.) అను వాక్యముచే ద్రవ్యమనుగుణము విధింపఁబడినదిగాన 'చిత్రయా యజేత పశుకామః' అను వాక్యముచే గుణవిశిష్టమగు యాగమును విధించుట కుదురదుగదా! ఈవాక్యముచేతనే యాగమునకు ఫలముతో సంబంధమును, గుణముతో సంబంధమునుగూడ విధింపఁబడునెడ ('పశువును గోరువాఁడు యాగముచే నిష్టము నుత్పాదించునది' 'చిత్రాపదమునకర్థమగు గుణముచే యాగము నుత్పాదించునది' అని) [171] వాక్యభేదము సంభవించెడినిగదా! కావున నిచట 'చిత్రా' శబ్దము (గుణమును బోధించునది కాక) కర్మమునకు నామధేయమగుచున్నది. కాఁగా "'చిత్రా' అను యాగము

169. మత్వర్థలక్షణ = 'అదికలది' అను నర్థమును బోధించులక్షణ. లక్షణ యనఁగా శక్తివిశేషము

170. ప్రాజాపత్యము = ప్రజాపతి దేవతగాఁ గలది.

171. వాక్యభేదము = రెండు వేఱువాక్యములుగా నన్వయించుట.

చేఁ బశువును త్పాదించునది" అని 'చిత్రా' శబ్దమును యాగమునకు విశేషణముగా నన్వయించుటచే వాక్యభేదము రానేరదు. ఈ యాగమునం దుదాహరింపఁబడిన యనేకద్రవ్యములు కూడియుండుటంజేసి దీనికి[172] 'చిత్రా' అను పేరు తగియున్నది,

'అగ్నిహోత్రం జుహోతి' అను విధియందలి 'అగ్నిహోత్ర' మను పదము తత్ప్రఖ్యమనెడి శాస్త్రముచే నిందు విధింపఁబడు కర్మమునకు నామధేయమగుచున్నది. తత్ప్రఖ్యము=తత్ + ప్రఖ్యము. ఇందు 'తత్' అను శబ్దమునకు గుణమనియు 'ప్రఖ్యము' అను పదమునకు ప్రకటించునది యనియు, నర్థము. కాఁగా, 'తత్ప్రఖ్యము' అను పదమునకు 'గుణమును బ్రకటించునది' అని యర్థము. (అగ్నిని గుణముగాఁ బ్రకటించు) ఇట్టి శాస్త్రముండుటంజేసి 'అగ్నిహోత్రము' అను శబ్దమిచట విధింపఁబడు కర్మమునకు నామధేయమగుచున్నది యని తాత్పర్యము. ఈవాక్యము (అగ్నిని గుణముగా విధించు) గుణవిధియని యేల చెప్పరాదు? అని శంకింపవలదు. 'అగ్నిహోత్రమ్' అను శబ్దమునకు "ఈకర్మమున నగ్నియందు హోమము జరుపఁబడును" అని సప్తమీ తత్పురుషసమాసము మూలముగా నర్థమును వివరించి, 'అగ్నిహోత్రం జుహోతి' అను వాక్యమందు 'అగ్నియను గుణము హోమమునకాధారముగా విధింపఁబడదగును' అని చెప్పునెడ, 'యదాహవనీయే జుహోతి' (='ఆహవనీయమను నగ్నియందు హోమముచేయును' అనునది) అను వాక్యముచేతనే యగ్నిహోమమునకాధారమగు గుణముగాఁ బ్రాప్తించుటంజేసి మరల నీ 'అగ్నిహోత్రం జుహోతి' అను వాక్యముచే నా యగ్నినే గుణముగావిధించుట నిష్ప్రయోజనమయ్యెడిని 'అగ్నిహో

172 చిత్రా=అనేకవిధములగు. ఉదా॥ చిత్రవర్ణము-చిత్రరూపము. మొ॥



త్రమ్' అను శబ్దమునకు 'ఈకర్మమునందగ్నికొఱకు హోమము జరుపఁబడును' అని చతుర్థీ తత్పురుషసమాసముమూలముగా నర్థమును వివరించి, యీ 'అగ్నిహోత్రం జుహోతి' అను వాక్యముచే 'అగ్నియను దేవత గుణముగా విధింపఁబడవచ్చునే' అని చెప్పఁదగదు. ఆయగ్నియను దేవత శాస్త్రాంతరముచేఁ బ్రాప్తించుచున్నదిగదా! ఆశాస్త్రమెయ్యది యంటేని:— "యదగ్నయేచ ప్రజాపతయేచ సాయం జుహోతి" (='సాయంకాలమం[173] దగ్నికొఱకును బ్రజాపతికొఱకును హోమమును జేయుటచే నిష్టముసంపాదించునది' అనునది) అను శాస్త్రముకలదని కొందఱు చెప్పుదురు. "అగ్నిర్జ్యోతిర్జ్యోతిరగ్నిస్స్వాహా" (=అగ్ని జ్యోతిస్స్వరూపమైనది. దీనికొఱకు హోమమగుఁగాక.) అను మంత్రవర్ణమే యగ్నియనెడు దేవతను గుణముగాఁ బ్రాప్తింపఁజేయుచున్నది యని మఱికొందఱు చెప్పుదురు. అయ్యా! అగ్నియనుదేవత 'అగ్నిర్జ్యోతిర్జ్యోతిరగ్నిస్స్వాహా' అను మంత్రవర్ణముచేఁ బ్రాప్తించునెడ దీనికి 'యదగ్నయేచ ప్రజాపతయేచ సాయంజుహోతి' అను వాక్యముచే విధింపఁబడు ప్రజాపతిదేవతవలన బాధ (=నివృత్తి=నిషేధము) సంభవించెడిని. 'అగ్నిర్జ్యోతిః' ఇత్యాది మంత్రవర్ణము 'యదగ్నయే...' ఇత్యాది వాక్యమునందు, ప్రజాపతిని దేవతగాసూచించు 'ప్రజాపతయే' అను చతుర్థికంటె దుర్బలముగదా! ఇందువిషయమై 'తద్ధితాంతముచేతనుగాని చతుర్థిచేతనుగాని మంత్రవర్ణముచేతనుగాని దేవత విధింపఁబడును. వానిలోఁ బూర్వపూర్వముకంటె నుత్తరోత్తరము దుర్బలమగు

173. 'అగ్నకొఱకు' అని చెప్పుటచే నిచట నగ్నియను దేవత గుణముగావిధింపఁబడుచున్నదని తెలియుచున్నది. ఇట్లే ప్రజాపతి దేవతయు నిచట గుణముగా విధింపఁబడుచున్నది

ను’ అని మీమాంసకుల నిర్ణయము కలదుగదా!” అను శంకకిం దిది సమాధానము. ‘యదగ్నయే...’ ఇత్యాది విధిచేఁ బ్రజాపతి దేవత యొకటిమాత్రమే విధింపఁబడుచుండుటలేదు. మఱేమన ‘అగ్నిర్జ్యోతిః’ అనున్నగు మంత్రముచేఁ బ్రాప్తించిన యగ్ని దేవతననువదించి, దానితోఁగూడిన ప్రజాపతి దేవత విధింపఁబడుచున్నది. కాఁగా ‘యదగ్నయే’ అను విధిచేఁ బ్రజాపతిదేవత యొకటిమాత్రమే విధింపఁబడుటలేదుగనుక, దానివలన నగ్ని దేవతకు బాధసంభవింపనేరదు. ఈ ‘యదగ్నయే’ అనువాక్యముచేఁ గూడియుండు నీయిద్దఱు దేవతలును నొకేసారి యేలవిధింపఁబడఁగూడదని ప్రశ్నింపవలదు. ఈ ‘యదగ్నయే’ అను విధివాక్యముచే కూడియుండిన యీయిద్దఱు దేవతలను నొకేసారి విధించుటకంటె ‘అగ్నిర్జ్యోతిః’ అనున్నగు వేఱొకవిధిచేఁ బ్రాప్తించిన యగ్నిననువదించి, దానితోఁగూడిన ప్రజాపతి దేవతనుమాత్రమే విధించుటయందు లాఘవము (=సౌలభ్యము=సౌకర్యము=సులువు) కలదుగదా! ఇట్లే ప్రయాజములనెడి హోమములను విధించు ‘సమిధో యజతి, తనూనపాతం యజతి, ఇడో యజతి, బర్హిషో యజతి, స్వాహాకారం యజతి’ అను నైదు వాక్యములందుఁగల సమిత్తుమున్నగు దేవతలు “సమిధో అగ్న ఆజ్యస్య వియన్తు” ఈయున్నగు మంత్రవర్ణములనుండి ప్రాప్తించుచున్నవి గానఁ బైనుదాహరింపఁబడిన యైదువాక్యములందలి ‘సమిత్తు’ మొదలగు శబ్దములు పైని వివరింపఁబడిన ‘తత్ప్రఖ్యము’ అను శాస్త్రముచే, నీయైదువాక్యములచే విధింపఁబడు ప్రయాజములనెడు కర్మములకు నామధేయములగుచున్నవి.

‘శ్యేనేనాభిచరన్ యజేత’ (=శత్రువధను గోరువాఁడు శ్యేనమను యాగముచే నిష్టమునుత్పాదించునది.) అనువిధియందలి శ్యేన



మనుశబ్దము, తద్వ్యపదేశమను న్యాయముచే నిందు విధింపఁబడు కర్మమునకు నామధేయమగుచున్నది. తద్వ్యపదేశము=తత్+వ్యపదేశము=దానితోఁబోల్చుట. దానితోఁబోల్చుటను సంబంధించి ముందు వివరింపఁబడఁబోవు[174] నర్థవాదవాక్యమొకటి యుండుటం జేసి యీ వాక్యమందలి శ్యేనమనుశబ్దము కర్మ నామధేయముకాదనియు, శ్యేనమను పక్షి (డేగ) యిందు విధింపఁబడు కర్మమునకు గుణముగా విధింపఁబడుచున్నదనియుఁ జెప్పునర్థము కుదురదు. అది యెట్లంటేని- విధియందేది విధింపఁబడునో యదియే యర్థవాదముచే స్తుతింపఁబడును. ఈవాక్యమందు శ్యేనమను పక్షి విధింపఁబడుచో నర్థవాదములచే దానికే స్తుతి జేయఁబడవలయును ‘యథా వై శ్యేనో నిపత్యాదత్తే ఏవమేవాయం ద్విషన్తం భ్రాతృవ్యం’ నిపత్యాదత్తే (=డేగయను పక్షి యెట్లు తనకాహారమగు నితరపక్షులపైఁబడి పట్టుకొనునో యట్లే యిది యజమానుని ద్వేషించు శత్రువుపైఁబడి యతనినిఁ బట్టుకొనును.) అను నీయర్థవాదముచే శ్యేనపక్షిని స్తుతించుటతగదు. శ్యేనమను నుపమానముచే మఱియొకవస్తువే స్తుతింపఁబడునుగదా! శ్యేనపక్షియను నుపమానముచే నది (శ్యేనపక్షి) యే స్తుతింపఁబడుటకు శక్యముకానేరదు. ఉపమానోపమేయభావము[175] వేఱువేఱు వస్తువులయందుండు ధర్మముగదా. ఈవాక్యమందు శ్యేనమను పేరుగల యాగమిచట విధింపఁబడుచున్నదని చెప్పెడి పక్షమందన్నో

174. ‘యథా వై శ్యేనో నిపత్యాదత్తే, ఏవమేవాయం ద్విషన్తం భ్రాతృవ్యం నిపత్యాదత్తే’ అను నర్థవాదవాక్యము ఒకడేగ యాకాశమందు సంచరించుచు భూమిపైనుండు నొకవస్తువును జూచి తటాలున దానిపైఁబడి పట్టుకొనునట్లే యీ శ్యేనమను యాగము తన్నాచరించు యజమానుని ద్వేషించు శత్రువుపైఁబడి బాధించును.

175. సాధర్మ్యముపమా భేదే = వేఱువేఱుగానుండు రెండువస్తువులు కొన్ని ధర్మములను సమానముగాఁగలిగియుండుటయే ఉపమాలంకారమని కావ్యప్రకాశికయందుఁ దశమయుల్లాసమందుఁ జెప్పఁబడినది.

యీయర్థవాదముచేత శ్యేనపక్షి నుపమానముగాఁగైకొని యాయాగమును స్తుతించుట శక్యమగుచున్నది. కావున 'శ్యేనేనాభిచరన్ యజేత' అను వాక్యమునందలి శ్యేనమనుపదము 'తద్వ్యపదేశము' అను న్యాయముచే నిందువిధింపఁబడు కర్మమునకు నామధేయమగుచున్నది.

కొన్నివిధులయందలి శబ్దములు, అందు విధింపఁబడు కర్మములకు నామధేయములని నిర్ణయించుటకు [176] 'ఉత్పత్తిశిష్టగుణముబలవత్తరమగుట' అను నైదవప్రమాణముగలదని కొందఱు చెప్పుదురు. ఉదా:- "వైశ్వదేవేన యజేత" (=వైశ్వదేవమను యాగముచేనిష్టమునుత్పాదించునది.) ఉత్పత్తిశిష్టగుణములగు [177] నగ్నిమున్నగు దేవతలు (ఈవాక్యమందుత్పన్నశిష్టగుణమగు విశ్వదేవులను దేవతలకంటె) బలవత్తరములగుటంజేసి యీవిధివాక్యము విశ్వదేవులనెడి దేవతలను గుణముగా విధించుట సంభవింపనేరదు. కావున నీవాక్యమందలి వైశ్వదేవమను శబ్దమిందు విహితమగు కర్మమునకు నామధేయమగుచున్నది. వాస్తవముగా 'తత్ప్రఖ్య' మను న్యాయముచేతనేయీవాక్యమందలి 'వైశ్వదేవ' శబ్దమిందు విధింపఁబడు కర్మమునకునామధేయమగుచున్నది. ఆగ్నేయము మొదలగు నెనిమిదియాగములసముదాయమైనదియు, 'వైశ్వదేవేన యజేత' అను వాక్యమునందనువదింపఁబడునదియు నగు యాగమునకు విశ్వదేవులనెడి దేవతలను 'కర్త'లనెడు గుణముగాఁ బ్రాప్తింపఁజేయు "యద్విశ్వేదేవాస్సమయజన్త. తద్వైశ్వదేవస్య వైశ్వదేవత్వం" (=విశ్వదేవతలను దేవతలీయాగమును జేసిరిగనుక దీనికి వైశ్వదేవమను పేరుకలిగెను.) అను నర్థవాదరూపమగు శాస్త్రమున్నదిగదా!

176. ఉత్పత్తిశిష్టగుణము; ఉత్పత్తి=కర్మోత్పత్తి; శిష్టము=విధింపఁబడినది. ఉత్పత్తిశిష్టగుణము=కర్మోత్పత్తికాలమందు విధింపఁబడు గుణము. కర్మోత్పత్తివాక్యమందుత్పన్నమైన కర్మమునను వదించి వేఱొకవాక్యమందు విధింపఁబడు గుణాంతరము ఉత్పన్నశిష్టగుణమగుచున్నది. ఉత్పత్తిశిష్టగుణమెప్పుడును నుత్పన్నశిష్టగుణముకంటె బలవత్తరమగును.

177. చాతుర్మాస్యయాగమందు, వైశ్వదేవము, వరుణప్రఘాసము, సాకమేధము, సునాసీరీయము నను నాలుగు పర్వములు గలవు. అందుఁ బ్రథమపర్వమున (i) 'ఆగ్నేయమష్టాకపాలం నిర్వపతి' అను నాగ్నేయయాగము, (ii) 'సౌమ్యం చరుం నిర్వపతి' అను సౌమ్యయాగము, (iii) 'సావిత్రం ద్వాదశకపాలం నిర్వపతి' అను సావిత్రయాగము, (iv) 'సారస్వతం చరుం నిర్వపతి' అను సారస్వతయాగము, (v) 'పౌష్ణం చరుం నిర్వపతి' అను పౌష్ణయాగము, (vi) మారుతం సప్తకపాలం నిర్వపతి' అను మారుతయాగము, (vii) 'సా వైశ్వదేవ్యామిక్షా' అను వైశ్వదేవయాగము, (viii) 'ద్యావాపృథివ్యమేకకపాలం నిర్వపతి' అను ద్యావాపృథివీయాగము, అను నెనిమిదియాగములు విహితములగుచున్నవి. వానిసన్నిధియందు 'వైశ్వదేవేన యజేత' అను విధి వినఁబడుచున్నది. పయి యెనిమిదివిధులయందుండు దేవతలుత్పత్తిశిష్టగుణములగుచున్నారు. ఆయెనిమిదియాగముల సంఘమే 'యుత్పన్నమై వైశ్వదేవేన యజేత' అను వాక్యమందలి 'యజేత' అను పదముచే ననువదింపఁబడుచున్నదిగాన నీవాక్యమందలి విశ్వేదేవులను దేవతలుత్పన్నశిష్టగుణములగుచున్నారు.



ఇట్లు మత్వర్థలక్షణ మొదలుగాఁగల యైదుప్రమాణములచే నాయావిధవాక్యములందలి కొన్నిశబ్దములందందు విధింపఁబడు కర్మములకు నామధేయములగుచున్నవనియు, నట్టినామధేయములు, విధింపఁబడు కర్మములను 'ఇవి యిట్టివి' అని [178] పరిచ్ఛేదించుటమూలముగాఁ బ్రమాణములగుచున్నవనియు, వివరముగా నిరూపింపఁబడినవి.

నిషేధవాక్యముల విచారము.

పురుషుని నివర్తింపఁజేయువాక్యము నిషేధమనఁబడును. నిషేధవాక్యములు (విధివాక్యములవలె నేదేనొక కర్మమునందుఁ బురుషుని బ్రవర్తింపఁజేయక) [179] అనర్థములకు హేతువులగు క్రియలనుండి పురుషుని నివర్తింపఁజేయుటచేతనే సార్థకములై ప్రమాణములగుచున్నవిగదా! అదియెట్లంటేని:—విధి (వాక్యము) [180] ప్రవర్తన

178. పరిచ్ఛేదించుట=నిర్దేశించుట=నిర్ణయించుట.

179. అనర్థము=అనిష్టము=హాని=ప్రత్యవాయము=పాతకము=ఆపత్తు. 180. ప్రవర్తన=భావన=చోదన,=ప్రేరణ=ప్రవర్తింపఁజేయుస్వభావము.

నును బోధించుచుఁ దనయందలి ప్రవర్తింపఁజేయు స్వభావమును వ్యర్థము కానీయక నిర్వహింపఁజేయుటకుఁగాను దనచే విధింపఁబడు యాగము మున్నగు కర్మము [181] లిష్టసాధనములని [182] యర్థాపత్తి ప్రమాణమువలనఁ దెలియఁజేయుచుఁ, బురుషునట్టి కర్మములం దెట్లు ప్రవర్తింపఁజేయునో యట్లే, 'నకలంజం భక్షయేత్' (=ఎఱ్ఱ యుల్లిని లేక విషముపూయఁబడిన బాణముచేఁ జంపఁబడిన మృగము యొక్క మాంసమును భక్షింపరాదు' దానిని భక్షించుట యనర్థమునకు మూలమని తాత్పర్యము.) ఈమున్నగు నిషేధవాక్యములుకూడ [182A] నివర్తనను బోధించుచుఁ దనయందలి నివర్తింపఁజేయు స్వభావమును వ్యర్థముకానీయక నిర్వహింపఁజేయుటకుఁగాను దనచే నిషేధింపఁబడు కలంజభక్షణము మున్నగు కర్మములు పరలోకమునందలి యనిష్టమునకు హేతువులగునని యర్థాపత్తిప్రమాణముచేఁ దెలియఁజేయుచుఁ బురుషుని నట్టి కర్మములనుండి నివర్తింపఁజేయును. 'అయ్యా! నిషేధవాక్యమెట్లు నివర్తనను బోధించును' అను ప్రశ్నమునకిక్రిందిది సమాధానము. 'నకలంజం భక్షయేత్' అను వాక్యమునందు భక్షధాతువునకర్థమగు భక్షణమునకు 'న' శబ్దమునకర్థమగు 'అభావము' తో వ్యవధానములేకున్నను నిది (భక్షణము) 'భక్షయేత్' అనుపదమందలి ప్రత్యయమున కర్థమగు భావనయం [183] దుపసర్జనముగాఁ దెలియఁబడుచున్నదిగాన నీధాత్వర్థమగు భక్షణము 'న' శబ్దమునకర్థమగు 'అభావముతో నన్వయింపనేరదు. ఏదేనొక దానికుపసర్జనముగాఁ దెలియఁబడునది మఱియొక దానితో నన్వయింపదుగదా! అట్లు

181. ఇష్టసాధనములు = కోరఁబడు స్వర్గము మున్నగువాని నుత్పాదించునవి.

182. అర్థాపత్తి వెనుకవివరింపఁబడినది చూ. పేజీ 17. 182 ఎ. నివర్తన = మరలింపఁజేయు స్వభావము.

183. ఉపసర్జనము = అప్రధానము.



న్వయించినచో 'రాజపురుషం ఆనయ' (=రాజునకుసంబంధించు పురుషుని దీసికొనిరమ్ము) అను నిట్టి వాక్యమునందుఁగూడఁ బురుషశబ్దార్థమగు పురుషునకుపసర్జనముగాఁ దెలియఁబడు 'రాజన్' శబ్దమునకర్థమగు రాజు 'ఆనయ' అను పదమందలి ధాతువునకర్థమగు 'తీసికొనివచ్చుట' అను క్రియతో నన్వయింపవలసివచ్చును. (కలంజశబ్దమునకర్థమగు నెఱ్ఱయుల్లి యనునది [184] కర్మకారకమునకుపసర్జనముగాఁ దెలియఁబడుటంజేసి 'న' శబ్దార్థమగు 'అభావము' తో నన్వయింపనేరదు.) కావున 'భక్షయేత్' అను పదమందలి 'లిఙ్' ప్రత్యయమునకర్థమగు భావనయే 'న' శబ్దమునకర్థమగు 'అభావము' తో నన్వయించును. ఇచట లిఙ్ ప్రత్యయమందలి 'ఆఖ్యాతత్వము'ను నంశముచే బోధింపఁబడు నర్థభావన, యాప్రత్యయమునందలి లిఙ్త్వమను నంశముచే బోధింపఁబడు 'ప్రవర్తన' యనుదాని కుపసర్జనముగాఁ దెలియఁబడుటంజేసి, 'న' శబ్దమునకర్థమగు 'అభావము' తో నన్వయింపనేరదు. మఱేమన లిఙ్త్వమను నంశముచే బోధింపఁబడు ప్రవర్తనారూపమగు శబ్దభావనయే, యావాక్యమందలి పదార్థములన్నిటిలోఁ బ్రధానమగుచున్నది గనుక, 'న' శబ్దమునకర్థమగు 'అభావము' తో నన్వయించును. 'న' అను శబ్దమునకుఁ దనతో నన్వయించుపదమునకర్థమగుదానికి విరోధించుదానిని బోధించుటయే స్వభావము. ఉదా॥ 'ఘటో న అస్తి' (=ఘటములేకుండుట అను వాక్యమందు 'న' అను శబ్దము 'అస్తి' (ఉండుట) అను శబ్దముతో నన్వయించుటంజేసి 'ఘటః అస్తి' అను పదములకర్థమగు 'ఘటము ఉండుట' అనుదానికి విరోధించు 'ఘటము లేకుండుట' అను నర్థమును దెలియఁజేయుచున్నది. ఇట్లే 'నకలంజం భక్షయేత్' అను నిషేధవాక్యమునందు 'న' అను శబ్దము 'భక్షయేత్' అను పదమందలి ప్రత్యయమందుండు లిఙ్త్వ

184. కర్మకారకము = కర్మమును దెలియఁజేయు ద్వితీయావిభక్తి.

మను నంశముతో నన్వయించుచుండుటం జేసి, యాలిఙ్ప్రత్యయమను నంశముచే బోధింపఁబడు ప్రవర్తన యను దానికి విరోధించు 'నివర్తన'యను దానినే తెలియఁజేయుచున్నది. కాఁగా, విధివాక్యము వినఁబడినతోడనే దానిని వినువాఁడు, 'ఈవాక్యము నన్నే దేనోక పనియందుఁ బ్రవర్తింపఁజేయుచున్నది' అని తెలిసికొనుచున్నాఁడు. కావునఁ బైని వివరింపఁబడినరీతిగా నిషేధవాక్యము వినఁబడినతోడనే దానిని వినువాఁడు 'ఈవాక్యము నన్నే దేనోకపనినుండి నివర్తింపఁజేయుచున్నది' యని తెలిసికొనుచున్నాఁడు. కాఁగా నిట్లు విధివాక్యమునకుఁ బ్రవర్తనమే తాత్పర్యమగునట్లు నిషేధవాక్యమునకు నివర్తనమే తాత్పర్యమగుచున్నది. క్రియాపదమందలి ప్రత్యయముయొక్క యర్థము 'న' శబ్దముయొక్క యర్థముతో నన్వయించిన [185] బాధ సంభవించు వాక్యములందున్ననో, ధాతువుయొక్క యర్థమే 'న' శబ్దముయొక్క యర్థముతో నన్వయించును. అట్టిబాధ (i) 'వానికి (స్నాతకునకు) నీక్రిందివ్రతము' అని యుపక్రమించుట (ii) 'వికల్పము రావలసియుండుట' అని రెండువిధములుగానున్నవి. వీనిలో మొదటిదానికుదాహరణము:- [186] 'స్నాతకునకిది వ్రతము' అని యారంభించి 'నేక్షేతోద్యంతమాదిత్యమ్' (=ఉదయించుచున్న సూర్యుని జూడక మనస్సుచే నతని సంకల్పించుచుండవలయును.) అను వాక్యము చెప్పఁబడుచున్నది. కనుక వ్రతసందర్భమందు వినఁబడు నీవాక్యమందు [187] 'పర్యుదాస

185. బాధ = వాక్యార్థమునకనుపపత్తి

186. స్నాతకుఁడు = గురుకులవాసముచే వేదాదివిద్యల నభ్యసించినపిదప బ్రహ్మచారిచేయు వ్రతమునకు 'సమావర్తనము' అని పేరు. అట్టివ్రతము నాచరించువాఁడు స్నాతకుఁడు.

187. పర్యుదాసము = అబ్రాహ్మణుని దీసికొనిరమ్ము అను వాక్యమందలి 'అబ్రాహ్మణుని' అనుపదమునకు బ్రాహ్మణునికంటె భిన్నమైనదియు, బ్రాహ్మణునితో సమానమైనదియు నగు 'ఇతరజాతిమనుష్యుఁడు' అను 'వ్యక్తిని' అను నర్థమును జెప్పుటయే పర్యుదాసమనఁబడుచున్నది.



ము' అను న్యాయము నాశ్రయించి యర్థమును వివరింపవలసియున్నది. అదియెట్లని యంటేని:-'వ్రత' అనుశబ్దము చేయఁబడవలసినకర్మమును రూఢియను శక్తివిశేషముచే బోధించుచున్నది గాన 'తస్య వ్రతమ్' (=వానియొక్క వ్రతము) అను వాక్యముచే 'స్నాతకునిచే నీవ్రతములు చేయఁబడవలసినవి' అని యారంభింపఁబడఁగా, 'అట్లు చేయఁబడవలసిన వ్రతమేది' యని యాకాంక్ష కలిగినపుడు 'నేక్షేతోద్యంతమాదిత్యం' అను నీమున్నగు వాక్యముచేఁ జేయఁబడవలసిన యొకకర్మము బోధింపఁబడుచున్నది. అట్లుకానిచో 'తస్యవ్రతమ్'అను పూర్వవాక్యమునకును 'నేక్షేతోద్యంతమాదిత్యమ్' ఈమున్నగు నుత్తరవాక్యమునకును నేకాన్వయము సిద్ధింపకపోయెడిని. కాఁగా; 'న ఈక్షేత ఉద్యంతం అదిత్యమ్' ఇచట 'న' శబ్దముయొక్క యర్థముతోఁ బ్రత్యయముయొక్క యర్థమన్వయించినయెడల, 'ఆచరింపవలసిన కర్మము' అని యర్థము సిద్ధింపకపోవుటంజేసి యట్టియన్వయము చేయరాదు. అట్లుచేసినచో, లిఙ్ ప్రత్యయరూపమగు విధికర్థమగు ప్రవర్తనకు విరోధియగు నివర్తన యనునదియే యట్లన్వయించిన 'న' శబ్దముచే బోధింపఁబడుచున్నదిగదా! అట్టినివర్తన 'యాచరింపఁదగినది' కానేరదుగదా! కావున 'నేక్షేతోద్యన్తమాదిత్యమ్' అను వాక్యమందు 'న' శబ్దము [188] ధాత్వర్థమగు ఈక్షణము (చూచుట) తో నన్వయించుచుఁ, దనకు [189] శక్యార్థమైన ధాత్వర్థమునకు విరోధించు 'ఈక్షణాభావము' (చూడకుండుట) కు సంబంధించునదియు నాచరింపఁబడఁదగినదియు నగు 'నేను జూడను అను సంకల్పము, అనెడి యర్థమును [190] లక్షణచే బోధించుచున్నది. కాఁగా; 'నేక్షేతోద్యంతమాదిత్యమ్' అను వాక్యమునకు "ఉదయించుచున్న యాదిత్యును

188. ధాత్వర్థము = ధాతువునకర్థము. 189. శక్యార్థము = చూ. పేజి. 2.

19) లక్షణ = చూ. పేజి 2.

ద్దేశించి 'నేను నిన్ను జూడను' అను సంకల్పమనెడి వ్రతమునాచరించుటచే నిష్టమునుత్పాదించునది" అని యర్థమేర్పడుచున్నది. ఇందలి భావనయందుంతు భావ్యమేదియని యాకాంక్ష కలుగఁగా; 'ఏతావతా హైనసా (హ+ఏనసా) వియుక్తోభవతి' (=దీనిచేఁ బాపమునుండి వియుక్తుఁడు కాఁగలఁడు) అను తరువాతవాక్యముచేత బోధింపఁబడు పాపక్షయమనునది భావ్యముగా నన్వయించుచున్నది. కాఁగా; 'తస్యవ్రతమ్' అను పూర్వవాక్యమునకును, 'నేక్షేతోద్యన్తమాదిత్యమ్' అను నుత్తరవాక్యమునకును నేకాన్వయము సిద్ధించుచునేయున్నది. ఇచట (నశబ్దముతో నన్వయించు) ధాతువుయొక్క యర్థముతో విరోధించు 'అనీక్షణము' (=చూడకుండుట.) అనెడి వేఱొక యర్థము లభించుచుండఁగా 'అనీక్షణసంకల్పము' ('నేను నిన్నుఁ జూడను' అను సంకల్పము) అనునదియే భావనయందు సాధనముగా నేల యన్వయింపవలెను! అని శంకింపరాదు 'అనీక్షణము' అనునది ఆచరింపఁదగినది కాకపోవుటంజేసి ప్రస్తుతమున భావనయందు (సాధనముగా) నన్వయింపఁదగదు.

(ii) నిషేధవాక్యమందలి 'న' శబ్దముయొక్క యర్థము క్రియాపదమందుండు ప్రత్యయముయొక్క యర్థముతో నన్వయించునెడల సంభవించు బాధలలో రెండవదగు 'వికల్పము రావలసియుండుట' అనుదానికుదాహరణము 'యజతిషు యే యజామహం కరోతి, [191] నానుయాజేషు' (=అనుయాజములుకాని యితర హోమములందు 'యేయజామహే' అనుమంత్రము నుచ్చరించునది.) అను నిట్టి వాక్యమందు (ముందువివరింపఁబడురీతిని) వికల్పము రావలసియుండు

191. నానుయాజేషు = న + అనుయాజేషు అని విభాగము. ఈ అనుయాజములు 'అనూయాజము' లని కూడఁ జెప్పఁబడుచున్నవి. ఇవి ప్రధానయాగమునకు వెనుకఁజేయఁబడు నంగహోమములు.



టంజేసి (పైనివివరింపఁబడిన) పర్యుదాసమను న్యాయమవలంబింపఁబడుచున్నది. అదియెట్లంటేని:- ఈవాక్యమందు 'న' శబ్దముయొక్క యర్థము 'కరోతి' అను పదమందలి ప్రత్యయముయొక్క యర్థమగు ప్రవర్తనతో నన్వయించునెడ, 'అనుయాజములాచరించునపుడు 'యేయజామహే' అను మంత్రము నుచ్చరింపరాదు అని నిషేధింపవలసివచ్చును. ప్రాప్తించుదానికే నిషేధమవసరముగాన నీనిషేధమునకు ముందుఁ బ్రాప్తియావశ్యకమగుచున్నది. 'యజతిషు యేయజామహం కరోతి' అను శాస్త్రముచేతనే 'యజతి' పదమునకర్థమైన యాగములలోఁ జేరిన 'అనూయాజము' లనాచరించునపుఁడు 'యేయజామహే' అను మంత్రమునకుఁ బ్రాప్తిసంభవించుచున్నది. ఒకశాస్త్రముచేఁ బ్రాప్తించుదానికి వేఱొకశాస్త్రముచేతనే నిషేధముండునపుడా రెండింటికిని వికల్పమేకలుగునుగాని వానిలోనొకటి రెండవదానిని బాధింప (=నిషేధింప=నివర్తింప) నేరదు. నిషేధశాస్త్రము తనచే నిషేధింపఁబడుదాని ప్రాప్తికి హేతువగు [192] రాగమునే బాధింపఁగలదుగాని యాప్రాప్తికి హేతువగు మఱియొకశాస్త్రమునుమాత్రము బాధింపనేరదుగదా!

'పదే జుహోతి' (=పాదమునందు హోమముచేయుచున్నాఁడు.) అను విశేషశాస్త్రముచే 'ఆహవనీయే జుహోతి' (=ఆహవనీయమను నగ్నియందు హోమముచేయుచున్నాఁడు) అను సామాన్యశాస్త్రమునకువలెనే 'నానూయాజేషు యేయజామహం కరోతి' (=అనూయాజముల నాచరించునపుడు 'యేయజామహే' అను మంత్రము నుచ్చరింపరాదు ) అను ('యేయజామహే' అనెడిమంత్రమును నిషేధించు విశేష)శాస్త్రముచేత 'యజతిషు యేయజామహే'

192. రాగము = అభిలాష = కోరిక.

(=యాగములందు 'యేయజామహే' అను మంత్రము నుచ్చరించునది) అను యాగసామాన్యమందు మంత్రమును విధించు సామాన్యశాస్త్రమునకు బాధకలిగెడిని యని చెప్పరాదు. ఒండొంటితో నపేక్షలేని శాస్త్రములు రెండునూత్రమే యొకదాని నొకటి బాధింపఁగలవుగదా! పదమందు హోమమును విధించు శాస్త్రము తనయందలి కర్మమును విధించుటకుఁగాను 'ఆహవనీయము' నందు హోమమును విధించు శాస్త్రము నపేక్షింపదు. (కావున 'పదమందు హోమమును విధించు శాస్త్రము 'ఆహవనీయము' నందు హోమమును విధి చెడి శాస్త్రమును బాధించును.) ప్రస్తుతమునందన్ననో 'నానుయాజేషు' అను నిషేధశాస్త్రము, తనచే నిషేధింపఁబడు యాగసామాన్యమునందలి మంత్రోచ్చారణము ప్రాప్తించుటకై, 'యజతిషు యేయజామహం కరోతి' అను యాగసామాన్యమునందు మంత్రోచ్చారణమును విధించు శాస్త్రము నపేక్షించుచున్నదిగాన దానినపేక్షింపనిదికాలేదు. కావున నీ 'నానుయాజేషు' అను నిషేధశాస్త్రము 'యజతిషు యేయజామహం కరోతి' అను విధిశాస్త్రమును బాధింపలేదు. కావున ('యజతిషు...' ఈమున్నగు) శాస్త్రముచే విధింపఁబడు మంత్రోచ్చారణమునకు 'నానుయాజేషు' అను శాస్త్రాంతరముచే నిషేధము కలుగునప్పుడా రెండుశాస్త్రములకును వికల్పమే సంభవింపవలసి యుండును. వికల్పమవలంబించినచో నందలి ప్రతిశాస్త్రమునకు నొక పక్షమందప్రామాణ్యము సంభవించునుగాన నట్టివికల్పము యుక్తము కానేరదు. అనుయాజముల నాచరించునపుడు 'యజతిషు...' ఈమున్నగు విధిశాస్త్రమునుబట్టి 'యేయజామహే' అను మంత్రమునుచ్చరించినచో 'నానుయాజేషు' అను నిషేధశాస్త్రమునకు, 'వ్రీహిభిర్యజేత' (=వ్రీహులచే యాగమునాచరించుటచే నిష్టమునుత్పాదిం



చునది) అను వ్రీహులనువిధించు శాస్త్రముననుసరించి వ్రీహులచే యాగమాచరించినచో, యవలను విధించు 'యవైర్యజేత' (=యవలచే యజించి యిష్టమునుత్పాదింపవలయును.) అను శాస్త్రమునకువలెనే, ప్రామాణ్యము సిద్ధింపనేరదు. ఇంతేకాక విధిశాస్త్రమును నిషేధశాస్త్రమును బురుషార్థములేయగుటం జేసి వానిరెంటివలనను రెండదృష్టములు కలుగునని కల్పింపవలసివచ్చును. కావున నిచట 'నానుయాజేషు' అను వాక్యమును బ్రతిషేధమును బోధించునట్లన్వయింపఁగూడదు. మఱేమన, నిందలి 'న' శబ్దమును 'అనుయాజశబ్దము' తో సంబంధింపఁజేసి పర్యుదాసమను న్యాయము ననుసరింపవలసియున్నది. ఇట్లుచేసిన యెడల 'న' శబ్దము 'అనుయాజ' శబ్దముతో నన్వయించి, శక్యార్థమగునదియు, 'అనుయాజపదార్థము' తో విరోధించునదియు నగు 'అనుయాజాభావము' అనుదానిని బోధింపక లక్షణామూలమున 'అనుయాజముకంటె వేఱగునది' అనునర్థమును బోధించుచున్నదిగనుక 'యజతిషు యేయజామహం కరోతి నానుయాజేషు' అనువాక్యమునుండి "అనుయాజములకంటె వేఱగు యాగములాచరించునపుడు 'యేయజామహే' అను మంత్రమునుచ్చరించునది" అనునర్థము సిద్ధించుచున్నది. కావున నిచట వికల్పమక్కఱలేదు. 'యేయజామహే' అను మంత్రము 'యజతిషు యేయజామహం కరోతి' అనువాక్యముచేతనే ప్రాప్తించుచున్నదిగాన 'నానుయాజేషు' ఈమున్నగు వాక్యముచే విధింపఁబడుటలేదు. మఱేమన, నీవాక్యము 'యజతిషు' ఇత్యాది సామాన్యశాస్త్రముచేఁ బ్రాప్తించిన 'యేయజామహే' అనుమంత్రముయొక్క యుచ్చారణము ననువదించి, 'యజతిషు' ఈమున్నగు విధి 'అనుయాజములకంటె వేఱగు యాగములయందే వర్తించును' అనురీతిని నామంత్రోచ్చారణమును అనుయాజములకంటె వేఱగు విధులవిషయమై విధించుచున్నది.

అయ్యా! ఇట్లయినచో సామాన్యశాస్త్రముచేఁ బ్రాప్తించిన దానిని విశేషవిషయమందు [193] సంకోచింప (నియమింపఁ) జేయుటయనెడి 'ఉపసంహారము' నకును బర్యుదాసమునకును భేదమేమియు లేకపోవలసివచ్చును. అని శంకింపరాదు. ఉపసంహారమను న్యాయము సామాన్యశాస్త్రముచే విధింపఁబడు క్రియను విశేషశాస్త్రమునందుద్దేశింపఁబడినదానియందుమాత్రమే నియమించి ప్రవర్తింపఁజేయుటయే ప్రయోజనముగాఁగలది. ఉదా॥ "పురోడాశం చతుర్ధా కరోతి" (=పురోడాశమును నాలుగుభాగములుగా విభజించునది) అను సామాన్యశాస్త్రముచేఁ బ్రాప్తించిన 'నాలుగుభాగములుగాఁజేయుట' "ఆగ్నేయం చతుర్ధా కరోతి" (=ఆగ్నేయయాగమందలి పురోడాశమును నాలుగుభాగములుగా విభజించునది) అను విశేషశాస్త్రమునందుద్దేశింపఁబడు 'ఆగ్నేయయాగమునందలి పురోడాశమునందుమాత్రమే నియమింపఁబడి జరుపఁబడుచున్నది. ఇట్లు జరుపఁబడుటకే 'ఉపసంహారము' అని పేరు. పర్యుదాసమన్ననో సామాన్యవిధిశాస్త్రముచేఁ బ్రాప్తించిన దానిని, నిషేధశాస్త్రమునందుద్దేశింపఁబడు విషయమునందుఁ బ్రవర్తింపఁజేయక దానికంటె వేఱగు నితరవిషయములయందు మాత్రమే నియమింపఁజేసి ప్రవర్తింపఁజేయుట- కావున నీపర్యుదాసము 'ఉపసంహారము' కంటె వేఱగుచున్నది. [194] కొన్నిచోట్ల విధియు నిషేధము నుండుటవలన వికల్పము రానైయున్నను, వేఱుగతిలేకుండుటంజేసి (పర్యుదాసమునుగాని ఉపసంహారమునుగాని యాశ్రయింపక) నిషేధవాక్యము, విధివాక్యముచేఁ బ్రాప్తించుదానిని

193. సంకోచింపఁజేయు = నియమించు—లోకమునందు వాడఁబడు 'సంశయించు' అనునర్థము మీశాస్త్రమునందు గ్రహింపఁబడును.

194. ఒకేవిషయమునుద్దేశించి విధియు నిషేధమునుండు సందర్భములు.



[195] నిషేధించునట్లుగానే యన్వయింపఁబడును. ఉదా॥ 'నాతిరాత్రే షోడశినం గృహ్ణాతి' (=అతిరాత్రమను [196] క్రతువునందు షోడశియనెడి [197] గ్రహమును దీసికొనకపోవుటచే నిష్టమునుత్పాదించునది.) ఈవాక్యమందు, "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి" (=అతిరాత్రమను క్రతువునందు షోడశియను పాత్రమును దీసికొనుటచే నిష్టమునుత్పాదించునది.) అను విధిశాస్త్రముచేఁ బ్రాప్తించిన 'షోడశియనుయజ్ఞపాత్ర' ను దీసికొనుట నిషేధింపఁబడుటంజేసి 'తీసికొనుట తీసికొనకపోవుట' అను నీరెండింటికి వికల్పము సంభవింపనైయున్నను, నిచటఁ బర్యుదాసము నాశ్రయింపరాదు. ఇచటఁ బర్యుదాసము నాశ్రయించినచో విధికిఁ బ్రవృత్తియే లేకపోవలసివచ్చును. అది యెట్లంటేని:— ఇచటి నిషేధవాక్యమందు 'న' శబ్దముయొక్క యర్థము పర్యుదాసన్యాయముచే, అతిరాత్రే 'షోడశి' 'నషోడశినం' అను పదముయొక్క యర్థముతో నన్వయించునెడ, నీవాక్యమునుండి 'అతిరాత్రమను క్రతువునందు షోడశిపాత్రకంటె వేఱొకపాత్రము తీసికొనుటచే నిష్టమునుత్పాదించునది' అనునర్థము రావలసివచ్చును. కాని యట్టి యర్థము చెప్పినచో 'అతిరాత్రే షోడశినం గృహ్ణాతి' అను ప్రత్యక్షవిధికి విరోధముకలుగునుగాన నట్టియర్థము చెప్పుటకువీలులేదు. లేదా; ఈ నిషేధవాక్యమందు 'న' శబ్దముయొక్క యర్థము పర్యుదాసన్యాయముచే 'నాతిరాత్రే షోడశినం' అని అతిరాత్రపదముయొక్క యర్థముతో నన్వయించునెడ నీవాక్యమునుండి 'అతిరాత్రముకంటె వేఱగు క్రతువునందు షోడశియను పాత్రమును గ్రహించుటచే నిష్టమునుత్పాదించునది' అనునర్థము రావలసివచ్చును. అట్టియర్థముచెప్పినచో

195. నిషేధించునట్లు = నివర్తింపఁజేయునట్లు = ప్రవర్తింపకుండఁజేయునట్లు

196. క్రతువు = యాగము. 197. గ్రహము = యజ్ఞపాత్రము.

'అతిరాత్రే షోడశినం గృహ్ణాతి' అను ప్రత్యక్షవిధికి విరోధము కలుగునుగాన నట్టియర్థముకూడఁ జెప్పుటకు వీలులేదు. కావునఁ బర్యుదాసము నాశ్రయించుటకు వీలులేను గనుక నీనిషేధశాస్త్రమందు వేఱుగతిలేకుండుటంజేసి విధిశాస్త్రముచేఁ బ్రాప్తించు 'షోడశియను పాత్రమును గ్రహించుట' యే నిషేధింపఁబడుచున్నదియని యేర్పడుచున్నది. ఇట్లుచేసినచో 'వికల్పము' వచ్చునేయని శంకింపరాదు. పైనిఁజెప్పఁబడినరీతిగా నిచటఁ బర్యుదాసము నాశ్రయించి వికల్పమురాకుండఁజేయుటకు వీలులేదుగనుక నిట్టివికల్పము వచ్చుటకూడ నిష్టమేయగుచున్నదిగదా! ఏలయన: 'కలంజభక్షణము' మున్నగువాని నిషేధముకంటె నీనిషేధమునందుమాత్రమీ విశేషముగలదు. ఇచట వికల్పముచే నొకదానికి నిషేధముకలిగినను నట్లు నిషేధింపఁబడునది యనర్థమును గలిగించునది కానేరదు. ఇచట 'విధి' 'నిషేధము' అను నీరెండును [198] క్రత్వర్థములేకదా! ఎచ్చట వికల్పములేదో; నిషేధింపఁబడునది శాస్త్రమువలనగాక రాగమువలననే ప్రాప్తించునో; నిషేధించుటకూడఁ [199] బురుషార్థమగుచున్నదో; యట్టిచోటులయందన్ననో నిషేధింపఁబడునది [200] యనర్థమును గలిగించునదగుచున్నది. ఉదా॥ 'నకలంజం భక్షయేత్' అనునిట్టి నిషేధవాక్యమందలి భక్షణమును నిషేధించుటయే పురుషార్థమగుచున్నదిగాన, నిషేధింపఁబడు 'కలంజమును భక్షించుట' యనునది యనర్థమునకు హేతువగుచున్నది 'తత్ర దీక్షితో నదదాతి, నజుహోతి, నపచతి' (=దీక్షనువహించునతఁడు దానముచేయరాదు;

198 క్రత్వర్థములు = క్రతువునకంగములు. 199. పురుషార్థము = పురుషునిచేఁగోరఁబడునదియు, వేదమందు విధింపఁబడు కర్మములచే సాధింపఁబడునదియునగు స్వర్గము మొదలగు నిష్టము. లేదా యట్టియిష్టము లభింపఁజేయు సాధనము.

200. అనర్థము = హాని = ప్రత్యవాయము = పాతకము.



హోమముచేయరాదు; వండరాదు,) అను నిషేధవాక్యముచే శాస్త్రమువలనఁ బ్రాప్తించు దానము మున్నగునవి నిషేధింపఁబడుచున్నవిగాన నిచట వికల్పము రావలసియుండును-అని చెప్పరాదు యాగమునాచరించు కాలముతప్ప నితరకాలములయందుఁ బురుషార్థములగు దానము హోమము మున్నైనవానిని నిషేధించుట పురుషార్థము కాకపోయినను (క్రత్వర్థమగుటంజేసి) నిషేధింపఁబడునవి (తాము క్రతువునందాచరింపఁబడునెడ నాక్రతువునకు లోపము కలిగించునుగాన) నట్టిలోపమనెడి 'అనర్థము' నకు హేతువులగుచున్నవి. ఉదా॥ ఋతుకాలమందలి స్వస్త్రీగమనము మున్నగునవి. ఇట్టివానిని నిషేధించుట క్రతువునకుపకరించునదగును గాన నివి యాచరింపఁబడినచోఁ గ్రతువునకు లోపమునుగలిగించుటయనెడి యనర్థమునకు హేతువులగుచున్నవి. కావున నిషేధవాక్యములు 'అనర్థము' నకు హేతువులగు క్రియలనుండి పురుషుని మరలించుటచేఁ బురుషార్థముతో సంబంధించుచుఁ బ్రమాణములగుచున్నవి.

అర్థవాదముల విచారము.

ఇఁక 'అర్థవాదము' లనెడి వేదభాగముయొక్క ప్రామాణ్యము నిరూపింపఁబడును. [201] 'ప్రాశస్త్యము, నింద' అను నీరెంటిలోనేదేనొకదాని (తాత్పర్యముమూలముగా) బోధించువాక్యమర్థవాదము. దానికిలక్షణచే ఫలమను ప్రయోజనముగల యర్థము తాత్పర్యమగుచున్నది. అది యెట్లంటేని:— అర్థవాదవాక్యము తనయందలి పదములనుండి శక్తిచేవచ్చు నర్థమునుమాత్రము బోధించినచోఁ బ్రయోజనమేమియు లేకుండుటంజేసి లక్షణచే, విధింపఁబడువానియందలి ప్రాశస్త్యమును, నిషేధింపఁబడువానియందలి నిందను దెలియఁ

201. ప్రాశస్త్యము = ప్రశస్తమగుట. పర్యవసానము = తాత్పర్యము.

జేయును వేదమంతయుఁ గ్రియనుబోధించుటయే ముఖ్యప్రయోజనముగాఁగలది గాన నట్టి వేదభాగమగు నర్థవాదము తనయందలి [202] వాచ్యార్థమును మాత్రమేబోధించినచోఁ దనకు నిష్ఫలత్వము సంభవించెనుగదా! అర్థవాదముల [203] కానర్థక్యము సంభవించుట యిష్టమే యనిచెప్పవలదు. 'స్వాధ్యాయోఽధ్యేతవ్యః' అను విధి 'సకలవేదమును యథావిధిగాఁజదువునది' అని బోధించుద్వారమున, 'వేదమంతయుఁ బ్రయోజనముగల యర్థమందుఁ దాత్పర్యముగలది' అని సూచించుచున్నదిగాన, అట్టి వేదముయొక్క భాగమగు నర్థవాదములకు నిరర్థకత్వమురాఁగూడదుగదా!

ఆయర్థవాదము [204] (i) విధిశేషము, [205] (ii) నిషేధశేషము నని రెండువిధములుగానున్నది. ఉదా॥ 'వాయవ్యగ్ం శ్వేతమాలభేత భూతికామః' (=ఐశ్వర్యముఁ గోరువాఁడు వాయుదేవతకొఱకు శ్వేతపశువునాలంభించుటచే నిష్టమును త్పాదించునది.) అను విధికి శేషమగు 'వాయుర్వై క్షేపిష్ఠా దేవతా' (వాయుదేవత శీఘ్రగమనముగలదిగనుక నావాయుదేవతకొఱకు యాగముచేయుటచేఁగలుగు ఫలము శీఘ్రముగా లభించును.) అను నర్థవాదము, విధిచేవిధింపఁబడు వాయుదేవతయను నర్థమందలి 'ఫలమును శీఘ్రముగా లభింపఁజేయుట' యనెడి ప్రాశస్త్యమును బోధించుమార్గమున విధితోనేకాన్వయమును బొందుచు [206] సార్థకమగుచున్నది. 'బర్హిషి రజతం న దే

202. వాచ్యార్థము = శక్యార్థము.

2 3. అనర్థక్యము = నిరర్థకత్వము = నిష్ఫలత్వము.

2 4. విధిశేషము = విధికంగము. 205. నిషేధశేషము = నిషేధమునకంగము విధిశేషమగు నర్థవాదము (1) ప్రశంసార్థవాదము (2) నిందార్థవాదము. (3) పరకృత్యర్థవాదము. (4) పురాకల్పార్థవాదము అని నాలుగువిధములుగానున్నది.

2 6. సార్థకము = సఫలము.



యం' ([207] రజతమును దక్షిణగా దర్భలయందుంచి యియ్యఁగూడదు.) అను నిషేధమునకు శేషమగు 'సోఽరోదీత్ యదరోదీత్ తద్రుద్రస్య రుద్రత్వమ్' (=వాఁడు రోదనముచేసెను. వానిని రోదనము చేయించుటవలన రుద్రునకట్టిపేరుకలిగెను. కావున దర్భలయందురజతమునుంచి యిచ్చువాని గృహమున నొకసంవత్సరములోఁగా రోదనము జరుగును) అనునర్థవాదము నిషేధవాక్యముచే నిషేధింపఁబడురజతదానమునందలి నిందను దెలియఁజేయు ద్వారమున నిషేధవాక్యముతోనేకాన్వయమునొందుచు సార్థకమగుచున్నది. 'అర్థవాదములనుండి, విధింపఁబడువానియందలి ప్రాశస్త్యమును, నిషేధింపఁబడువానియందలి నిందను దెలిసికొనుటచే, సుఖమనెడి ప్రయోజనముగాని, దుఃఖముకలుగకుండుటయను ప్రయోజనముగాని యేమియు లేదుగావున నట్టియర్థవాదములకు సార్థక్యము సిద్ధింపనేరదు.' అనిచెప్పవలదు. అట్టి ప్రాశస్త్యము మున్నగువానిని దెలిసికొనుట, [208] మాంద్యము మొదలయిన కారణములవలనఁ బ్రవర్తింపని పురుషుని విధేయములగు కర్మములందుఁ బ్రవర్తింపఁజేయుటమూలముగా నుపయోగించుచున్నదిగదా! ఈయర్థవాదము (i) గుణవాదము, (ii) అనువాదము, (iii) భూతార్థవాదము నని మూఁడువిధములుగానున్నది. ఇందులకు :-

"విరోధే గుణవాదస్స్యాదనువాదోఽవధారితే ।
భూతార్థవాదస్తద్ధానాదర్థవాదస్త్రిధా మతః ॥"

అను ప్రమాణముగలదు. దీనికర్థము:-(i) ప్రమాణాంతరముచే బాధింపఁబడు నర్థమును బోధించు నర్థవాదము గుణవాదము. ఉదా॥ 'ఆదిత్యో యూపః' (=యూపమాదిత్యస్వరూపమైనది.) అను నిట్టి యర్థవాదము. ఈయర్థవాదముచే బోధింపఁబడు 'యూపమాదిత్యుని

207. రజతము = వెండి. 208. మాంద్యము = సోమరితనము.

కంటె వేఱుకానిది.' అను నర్థము ప్రత్యక్షమనెడి ప్రమాణముచే [209] బాధింపఁబడుచున్నది గాన నీయర్థవాదము లక్షణచే 'ఆదిత్యునివలెఁ బ్రకాశించుట అనెడి గుణము యూపమందుఁగలదు.' అనెడు నర్థమును దెలియఁజేయుచున్నది. (ii) ప్రమాణాంతరముచే బోధింపఁబడిన యర్థమును బోధించు నర్థవాదము 'అనువాదము' అనఁబడుచున్నది. ఉదా॥ 'అగ్నిర్హిమస్య భేషజమ్' (అగ్ని మంచుకు విరోధి) అను నర్థవాదము. ఇచట నగ్ని మంచునకు విరోధి యనునర్థము ప్రత్యక్షమను ప్రమాణముచేఁ దెలియఁజేయఁబడినదిగదా! (iii) ప్రమాణాంతరముతో విరోధమును, ప్రమాణాంతరముచేఁ బ్రాప్తియులేని యర్థమును బోధించు నర్థవాదము భూతార్థవాదము. ఉదా॥ 'ఇంద్రో వృత్రాయ వజ్రముదయచ్ఛత్' (=ఇంద్రుఁడు వృత్రాసురునికొఱకు వజ్రాయుధమును బైకెత్తెను.) ఈయర్థవాదమునందలి యర్థము ప్రమాణాంతరముతో విరోధించుటయుఁ బ్రమాణాంతరముచేఁ బ్రాప్తించుటయు లేదు కాన నిది భూతార్థవాదమగుచున్నది. ఇట్లు వేదములో నొకభాగమగు నర్థవాదవాక్యములకుఁ బ్రామాణ్యము నిరూపింపఁబడినది. కాఁగా 'యజేత స్వర్గకామః' అను నీమున్నగు వాక్యముల సముదాయమైన వేదమంతయు సాక్షాత్తుగాఁగాని పరంపరగాఁగాని యాగములు మున్నగు ధర్మములను దెలియఁజేయుట సిద్ధించుచున్నది. అట్టిధర్మము, దేనినుద్దేశించి విధింపఁబడుచున్నదో, దానినే యుద్దేశించి యాచరింపఁబడుచున్నదై దానికి హేతువగుచున్నది. ఆధర్మమే యీశ్వరునకు సమర్పించు సంకల్పముతో నాచరింపఁబడునెడ మోక్షమునకు హేతువగుచున్నది. ధర్మమును ఈశ్వరునకర్పించు సంకల్పముతో నాచరించుటకుఁ బ్రమాణము లేకపోలేదు "యత్కరోషి య

209. బాధింపఁబడుట = ఇది యథార్థము కాదని తెలియఁజేయఁబడుట



దశ్నాసి యజ్జుహోషి దదాసి యత్। యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్॥" (=అర్జునా! దేనినాచరించుచున్నావో, దేనిని భుజించుచున్నావో, దేనిని హోమముచేయుచున్నావో, దేనిని దానముచేయుచున్నావో, ఏతపమాచరించుచున్నావో, దానినంతను నాకర్పింపుము.) అను భగవద్గీతయను స్మృతియందలి వాక్యమే ప్రమాణమగుచున్నదిగదా! జైమినిచే రచింపఁబడిన సూత్రగ్రంథమందు, స్మృతుల విచారముగల పాదమున స్మృతులు శ్రుతుల ననుసరించుటచేఁ బ్రమాణములగుచున్నవని నిర్ణయింపఁబడినదిగదా!

మంగళము శ్రీ శ్రీ శ్రీ





శ్రీమారుతీముద్రానిలయము, అమలాపురము.

# తప్పొప్పుల పట్టిక



| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 14 | సర్ధము | సర్థము |
| ,, | 15 | సఁకేతితార్థ | సంకేతితార్థ |
| 3 | 2 | సగునర్ధ | సగునర్థ |
| 5 | 9 | నితఁడు జేయుచున్నాఁడు | నితఁడు చేయుచున్నాఁడు |
| ,, | 15 | (a) తాత్పర్యము | తాత్పర్యము |
| ,, | 16 | (b) ఆఖ్యాతత్వము | (a) ఆఖ్యాతత్వము [ట |
| ,, | 17 | (c) లిజ్త్వము=ధించుట | (b) లిఙ్త్వము=విధించు |
| 6 | 3 | చేబ్రయోగింపబడు | చేఁబ్రయోగింపఁబడు |
| ,, | 13 | వలయిను | వలయును |
| ,, | 14 | ఎట్లుఁ | ఎట్లు |
| ,, | 15 | పురుషు డు | పురుషుఁడు |
| ,, | 21 | సిద్దాంతము | సిద్ధాంతము |
| ,, | 23 | నాథింపఁబడు | సాధింపఁబడు |
| 7 | 1 | జేయవలయును | చేయవలయును |
| ,, | 2 | యాఁకా. త్కము | యాఁకా త్క |
| ,, | 17 | కలుగఁగాఁసర్థ | కలుగఁగా సర్థ |
| ,, | 21 | శబ్ధము | శబ్దము |
| 8 | 21 | సాథించు | సాధించు |
| 13 | 10 | హోమము జేయుట | హోమము చేయుట |
| ,, | 22 | ధాత్వర్ధమగు | ధాత్వర్థమగు |
| ,, | 24 | బ్రిధ | బ్రిధ |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 14 | 10 | లిఙ్ష్మున్నగు | లిఙ్ మున్నగు |
| ,, | 22 | పరార్ధమగుట | పరార్థమగుట |
| ,, | 25 | లిఙ్ష్ | లిఙ్ |
| 15 | 16 | ప్రాోక్షతి | ప్రోక్షతి |
| ,, | 2 | గృభ్ణన్ | గృభ్ణన్ |
| ,, | 2 | త్యన్యాభిధానీ | త్యశ్వాభిధానీ |
| ,, | 15 | నుపఁబడును | నుంపఁబడును. |
| ,, | 16 | నుచ్ఛరిఁపక | నుచ్చరింపక |
| ,, | 18 | స్రిదేశము | ప్రదేశము |
| ,, | 22 | మూడగ్నులకు | మూఁడగ్నులకు |
| ,, | 23 | ఏనిలో | వీనిలో |
| 17 | 19 | ఎకత్వ | ఏకత్వ |
| 19 | 11 | మనబడును | మనఁబడును. |
| 20 | 1 | కర్మముకఁగన | కర్మమునకంగ |
| 21 | 6 | పాపగ్గ | పాపగ్ |
| 23 | 13 | సమిద్భాగము | సమిద్యాగము |
| 33 | 23 | ఉద్దేశించి జేయఁబడు | ఉద్దేశించి చేయఁబడు |
| 26 | 4 | త్రైభ్యో | ప్రైభ్యో |
| ,, | 5 | స్తుదతే | స్తుదతే |
| 28 | 3 | బఠిపఁబడి | బఠింపఁబడి |
| ,, | 4 | ననిజెప్పుటకు | ననిచెప్పుటకు |
| 30 | 12,13 | నాన్నాయ్య | సాన్నాయ్య |
| 31 | 18 | సర్గకాముఁడు | స్వర్గకాముఁడు |
| ,, | 24,25 | వేదోక్తి కర్మము | వేదోక్తకర్మము |



| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 32 | 18 | (=ఆప్రిధానము) | (=అప్రధానము) |
| 23 | 11 | పమాపూర్వము | పరమాపూర్వము |
| 35 | 4 | పదార్ధములను | పదార్థములను |
| 36 | 13 | యెడల | యెడలఁ |
| ,, | 21 | పదార్ధములను | పదార్థములను |
| 37 | 4 | ప్రిహ్మణ | బ్రాహ్మణ |
| ,, | 18 | చున్నది | చున్నవి |
| ,, | 24 | పురోమవాక్యా | పురోనువాక్యా |
| 38 | 3 | చేయబడిన | చేయఁబడిన |
| ,, | 5 | నాద్యస్క్రము | సాద్యస్క్రము |
| ,, | 7 | నాకీనారి | నాకేసారి |
| ,, | 17 | నాద్యస్క్రము | సాద్యస్క్రము |
| 29 | 16 | న్థానము | స్థానము |
| 40 | 7 | స్కముసందు | స్క్రమునందు |
| 41 | 1 | భఁగము | భంగము |
| ,, | 4 | ఐదప్రియాగము | ఐంద్రియాగము |
| ,, | 6 | సంబధించు | సంబంధించు |
| 42 | 3 | న్వాధ్యాయ | స్వాధ్యాయ |
| ,, | 12 | మవలంబిచినచో | మవలంబించినచో |
| 43 | 16 | సస్కారము | సంస్కారము |
| ,, | 17 | సంన్కారము | సంస్కారము |
| 44 | 5 | నాచరిచుటచే | నాచరించుటచే |
| ,, | 6 | నుడువిధి | నుండువిధి |
| ,, | 9 | గృహాస్ | గృహాన్ |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 44 | 18 | జనిచు | జనించు |
| 45 | 14 | న్వారాజ్యము | స్వారాజ్యము |
| 46 | 1 | తెలియఁజేయ | తెలియఁజేయఁ |
| ,, | 4 | నధికాకి | నధికారికి |
| ,, | 6 | విధిచు | విధించు |
| ,, | 20 | ఆహవయము | ఆహవనీయము |
| 47 | 10 | యుడగా | యుండఁగా |
| ,, | 11 | శకింపరాదు | శంకింపరాదు |
| ,, | 15 | నాధిషఁదగిన | సాధింపఁదగిన |
| ,, | 17 | నాధనము | సాధనము |
| ,, | 23 | జనిపఁజేయును | జనింపఁజేయును |
| 48 | 4 | పమాణాంతరము | ప్రమాణాంతరము |
| ,, | 6 | నాధింపఁదగిన | సాధింపఁదగిన |
| ,, | 7 | నాధనము | సాధనము |
| ,, | 8 | ,, | ,, |
| ,, | 11 | పశ్నము | ప్రశ్నము |
| ,, | 13 | వ్యతిరేకముచే | వ్యతిరేకములచే |
| ,, | 20 | విధిచే | విధిచే |
| 61 | 4 | నార్థకము | స్వార్థకము |
| 52 | 3 | యుడుటంజేసి | యుండుటంజేసి |
| ,, | 7 | దుడు | దుండు |
| ,, | 11 | విధిపఁబడు | విధింపఁబడు |
| 53 | 10 | పెరుగు | పెరుఁగు |
| 55 | 12 | దెవతను | దేవతను |
| 56 | 7 | సేందు | సేరదు |
| ,, | 15 | ఇదోయజతీ | ఇడోయజతి |



| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 16 | న్వాహాకారం | స్వాహాకారం |
| ,, | 18 | ప్రాప్తిచు | ప్రాప్తించు |
| 57 | 11 | స్తుతిజేయ | స్తుతిచేయ |
| 58 | 4 | నిదువిధింప | నిందువిధింప |
| ,, | 14 | ఉత్సన్నశిష్ట | ఉత్పన్నశిష్ట |
| 60 | 11 | కలంజంభక్షణ | కలంజభక్షణ |
| 62 | 18 | చుడవలయును | చుండవలయును |
| 65 | 9 | నపుఁడు | నపుడు |
| 66 | 8 | విధిచెడి | విధించెడి |
| ,, | 9 | ప్రస్తుతనువదన్నో | ప్రస్తుతమునందన్నో |
| 66 | 10 | యాగసాయాన్య | యాగసామాన్య |
| 67 | 12 | బోధిపక | బోధింపక |
| ,, | 19 | పాప్తించు | ప్రాప్తించు |
| 68 | 2 | సంకోచిప | సంకోచింప |
| ,, | 5 | నామాన్య | సామాన్య |
| 71 | 4 | కాలముయందు | కాలములయందు |
| ,, | 7 | దాచరిపఁబడు | దాచరింపఁబడు |
| 72 | 14 | శీఘ్రుగమన | శీఘ్రగమన |
| ,, | 16 | శిఘ్రము | శీఘ్రము |
| ,, | 22 | అనర్థక్యము | ఆనర్థక్యము |
| 73 | 7 | నిదను | నిందను |
| ,, | 12 | నార్థక్యము | సార్థక్యము |
| ,, | 19 | స్త్రీధా | స్త్రీధా |
| 74 | 6 | మంనచుకు | మంచునకు |
| ,, | 9 | బ్రమాణాతర | బ్రమాణాంతర |

శ్రీమారుతీముద్రానిలయము, అమలాపురము.

